విజయ అనుబంధం



# అన్నపూర్ణ

విమలా రామం

'విజయ' అనుబంధ మాలికలో
వెలువడ్డ ఇరవై రెండవ నవల

విజయ
80. ధనలక్ష్మీ కాలనీ
మద్రాసు-26

విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 24
NOVEMBER 1977

ANNAPURNA
VIMALARAMAM

ముఖచిత్రం : గంగాధర్

వెల : చెల్లింపలేనిది

(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడ్డ అమూల్య కానుక)



ప్రింటర్స్ :
విజయా గ్రాఫిక్స్,
3. ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

2

# అన్నపూర్ణ

విమలా రామం

అన్నపూర్ణ నిద్ర లేచింది. నూతిలో చేద వేసింది.

పాకలో ముడుచుకు పడుకున్న పడమటావు తల యెత్తింది. తల్లి కాళ్ళ మీదకి తలపెట్టి పడుకున్న పెయ్యదూడ ఎవరో తట్టి లేపినట్టు లేచింది. కాళ్ళు సాచి ఒళ్ళు విరుచుకుని గంతులేసింది.

మామిడిచెట్టు చిటారు కొమ్మ మీద కునుకు తీస్తున్న పిట్టేదో కువ కువ లాడింది. 'ఓహో! నాకు వేళయింది కాబోలు!' అనుకుంటూ పక్కింటి రామరాజుగారి దొడ్లోని కోడి కూసింది.

ఇక తప్పదనుకుంటూ తూర్పున పొద్దు పొడిచే సన్నాహం చేసింది.

అప్పట్నించి ఆ యింట్లో చైతన్యం ప్రారంభం!

ఆ యింట్లోనే కాదు....ఆ వూళ్ళోనే పశు పక్ష్యాదుల కన్నా అన్నపూర్ణ ముందు నిద్ర లేస్తుందంటే అతిశయోక్తి లేదు!

మరికాసేపటికి జగన్నాథం లేచి వచ్చాడు.

అన్నపూర్ణ నీళ్ళ చెంబు అందించింది.

"నేను తీసుకుంటానుగామ్మా!" అన్నాడు.

ఆమె చిరునవ్వు నవ్వింది. అప్పటి ఉషఃకాంతుల కన్న తళ తళ మెరిసిందా నవ్వు!....తూర్పున సూర్యుడుదయించటం మర్చి

పోవచ్చునేమో కాని కొన్నేళ్ళుగా ఆ యింట్లో ఇలాగే రోజు మొదలవుతోంది.

ఆమె మీద వాత్సల్యంతో ఆయన గుండె నిండింది. ఆమె మీద ఆయనకి ఎనలేని అభిమానం! ప్రొద్దున్నే అన్నపూర్ణ ముఖం చూస్తే ఆ నాడంతా శుభం-జయం-శాంతి-అలా ఆయన కనిపిస్తుంది.

ఆయన చుట్ట ముట్టించుకొని బయటకి నడిచాడు. ఊరు దాటి ఓ రెండు మూడు ఫర్లాంగుల దూరం చేలగట్ల వైపు వెళ్ళటం ఆయన కలవాటు. ఈ నాటిదా?....తరతరాలుగా తాత తండ్రుల నుంచి వచ్చిన అలవాటు.

నిన్న మొన్నటి వరకు అసలు మరుగు దొడ్లంటూ కట్టుకుంటారని కూడా తెలియనట్లుండేవారు ఆ పల్లెటూర్లో జనం. పట్నవాసం చూచి వచ్చాక బాగా ఉన్న వాళ్ళు ఇటిక గోడలు లేపించి 'లెట్రిన్స్' కట్టించుకున్నారు. తర్వాత్తర్వాత కొందరు మధ్యతరగతి కుటుంబాల వాళ్ళు కూడా ఉన్నంతలో తడికలు అడ్డు కట్టించుకొని మరుగు దొడ్లు నిర్మించుకున్నారు.

ఇలాంటి ఏర్పాట్లు చేసుకొన్నాక మగవాళ్ళ మాటకేమీ కాని ఆ యిళ్ళల్లో ఆడవాళ్ళకి ఒక పెద్ద అవస్త తప్పింది! అయినా, అదృష్టం ఎందరికి? ఊళ్ళో మహా అయితే నూటికి పది మందికి! తక్కిన వాళ్ళు బంగన బయిలుకి పోవల్సిందే!

తెల తెల వారకుండా బయలు ప్రదేశానికి హడావిడిగా పోవడం. లేక సాయింత్రం చీకటి పడేవరకు ప్రాణాలు ఉగ్గపట్టుకోవటం! అలా అందరికీ అన్ని వేళలా సాధ్యం కాదుగదా? ఆ బాధ భరించలేని వాళ్ళు పగలయినా పోక తప్పదు. నీళ్ళెక్కడ పడితే అక్కడుండవు కదా-వాళ్ళెందుకు వెడుతున్నారో చేతుల్లోని చెంబులే చెబుతాయి! అక్కడికేదో తప్పు పని చేయటానికి వెడుతున్నట్లు ఆడవాళ్ళంతా తలలు దించుకొని పోవటం....అరుగుల మీద కూర్చుని ముఖాలు కడుక్కునే మొగవాళ్ళ చూపుల నెదుర్కోవటం మాటటుంచి వీధిలో పాచిచేపి ముగ్గులు పెట్టుకునే ఆడవాళ్ళ ముఖాలు చూడటానికక్కూడా సిగ్గు! ఊరి చివరగా ఉన్న ఇళ్ళ వాళ్ళ కింతచేటు బాధ లేదు కాని....ఇక ఊరి మధ్యనున్న వాళ్ళ అవస్తే చెప్పుకోవాల్సింది!

అందులో వాళ్ళంతా కొద్దో గొప్పో ఉన్నవాళ్ళు - లేక మధ్య తరగతి వాళ్ళు! వాళ్ళల్లో చాలామంది అక్షరం ముక్కలు వచ్చిన వాళ్ళు. దాంతో ఆ భావన, ఆ ఫీలింగ్, ఆ స్పృహ మరింత ఎక్కువ.

ఊరు దాటి రెండు మూడు ఫర్లాంగులు పోతారు. అప్పటికో వాళ్ళ కష్టం గట్టెక్కదు. ఇది వరకు రోజుల్లో అయితే ఊరు దాటితే చాలు తుప్పలు, దొంకలు బాగా విస్తారంగా ఉండేవి. అవి ఇలాంటి ఆడవాళ్ళ పాలిట మరుగ్గా, రక్షగా నిలిచేవి. ఊళ్ళో వాళ్ళ కోసం మరుగు దొడ్లు ఏర్పాట్లయితే చేయించలేదు కాని-గ్రామ పంచాయితీ వారు పట్నం నుంచి గ్రామానికి రోడ్లు వేయించారు. ఆ సందర్భంలో ఆ దొంకలు, తుప్పలు చాలా వరకు కొట్టి వేసారు. వాటి వెనుక చేలుంటాయి. కుప్ప నూర్పిళ్ళ కాలంలో అయితే, అటూ యిటూ అంతా బహిరంగమే. తుప్పలు, పిచ్చి మొక్కలు ఏపుగా పెరిగి నప్పుడు ఆడవాళ్ళకు రక్షణ. పంచాయితీ వారు మళ్ళీ ఎప్పుడో ఎన్నికలప్పుడు-నిద్ర లేచినప్పుడు-మళ్ళీ వాటి భరతం పడతారు. వాస్తవంగా పంచాయితీ వారి బద్ధకాన్ని హర్షించేది ఇలాంటి ఆడ వాళ్ళు మాత్రమే. లేకపోతే ఆ రోడ్డు మీద మగవాళ్ళు వెళుతుంటే ఆడవాళ్ళ అవస్థ ఇంతా అంతా కాదు. పాపం! ఆవేళప్పుడు ఆ రోడ్డు మీద నడవటం మగవాళ్ళకీ ఇబ్బందిగానే ఉంటుంది.

మగవాళ్ళల్లో కాలకృత్యాల కోసం ఇంకా పైకి వెళ్ళే వాళ్ళుంటారు. పొలాలకి పోయే వాళ్ళుంటారు. రాత్రి పొలాల్లో కాపుండి తెల్లవారి యిళ్ళకు తిరిగి వచ్చే వాళ్ళుంటారు. తెల తెలవారు తున్న దంటే ఎంతోమందికి ఏదో ఒక పని ఆ రోడ్డు మీద తప్పదు. కాల కృత్యాలు తీర్చుకోవటం అనే ప్రకృతి ధర్మం నెరవేర్చుకోవటానికి రోడ్డు కిరు వైపుల కనిపించే ఆడవాళ్ళెవ్వరు? ఆ వేళప్పుడు అలా వెళ్ళే మగవాళ్ళల్లోవాళ్ళ భార్యలే ఉండవచ్చు, కూతుళ్ళుండచ్చు, కోడళ్ళుండచ్చు....చివరికి తల్లులే ఉండచ్చు. అయినా ఆడవాళ్ళకీ బాధలు తప్పవు, మగవాళ్ళకూ ఇబ్బందులు తప్పవు!

అనాదిగా అందరూ అనుభవిస్తున్నదే! అది ఆ పల్లెటూరి జీవితాల్లో ఒక భాగమయిపోయింది....ఈ మధ్యకాలంలో ఊరివాళ్ళకి

తగ్గిన బాధల్లా ఆవగింజలో అరవయ్యో వంతంత. ఈ అవస్థ లేవి వాళ్ళ నా వూళ్ళో వేళ్ళ మీద లెక్క పెట్టవచ్చు.

అయితే, శ్రమపడి బయటకి పోవల్సిన అవసరం జగన్నాధానికి లేదు. ఆయన స్కూలు మాష్టరు గిరీ నుంచి రిటయిరు కాక ముందే పెద్దకొడుకు సూర్యం ఇంటి వ్యవహారాలు తలకెత్తుకున్నాడు. ఆ బాధ్యతల్లో వెనక దొడ్లో మరుగు దొడ్డి కట్టించటం ఒకటి. పిల్లలతో సహా ఇంట్లో అంతా ఆ దొడ్డినే ఉపయోగించుకుంటున్నారిప్పుడు. కాని, ఏళ్ళ తరబడి ఉన్న అలవాటు మార్చుకోవటం జగన్నాధకి సాధ్యం కాలేదు.

ఎటొచ్చీ, ఆ రోడ్డు వెంట వెళ్ళేటప్పుడు....ఆయనకిబ్బంది-ఆడవాళ్ళకి బాధ, అన్నవి ఎప్పుడూ లేవు....ఆయన చీకటి తెరలింకా లోకావి కడ్డం తొలగక ముందే వెళ్ళి వచ్చేస్తాడు.

అంత తెలవారక ముందే....కోడి కూత వేళకు ముందు....కోడలు అన్నపూర్ణ-నూతిలో చేద వేయటం తరువాయి ఆయనకి మెలకువ వస్తుంది. అప్పట్నించి ఆయన దిన కృత్యాలు ప్రారంభమవుతాయి.

ఆయన తిరిగి వచ్చేసరికి అన్నపూర్ణ స్నానం పూర్తయి పోయింది. నూతి చప్టా దగ్గర పనిమనిషి వెంకమ్మ అంట్లు తోముతోంది.

ఆయన దారి వెంట వస్తూనే పలుతోము పుల్ల నములుతూ వస్తాడు. వెంకమ్మ చేదనీళ్ళు తోడబోతుంది- అన్నపూర్ణ వేన్నీళ్ళ చెంబుతో ఇవ్వబోతుంది.

దేగిసా క్రింద మండే మంట వెలుగు వాళ్ళందరి ముఖాల మీదా పడుతుంది. ఆ వెలుగులో వాళ్ళ వైపు చూసి "....నాకీ మాత్రమయినా ఒళ్ళొంగక పోతే ఎలాగ?" అని ఆయన నవ్వుతాడు....పనిమనిషి చేతిలోంచి చేద లాక్కుని తనే నీళ్ళు తోడి ముఖం కడుక్కుంటాడు.

"....నూతిలోని నీళ్ళకున్న సుఖం వేన్నీళ్ళకిలేదు!" అంటాడు. వెంకమ్మ నవ్వుతుంది. అన్నపూర్ణ నవ్వుతుంది. జగన్నాధం

నవ్వుతాడు....ఇలాగే జరుగుతుంది ప్రతి రోజూ। ఆ రోజునా అలాగే జరిగింది.

"నీళ్ళు కాగాయి మామయ్యా! పోసుకుంటారా!" అని అడిగింది అన్నపూర్ణ.

"వేన్నీళ్ళు కొంచెం ఆలశ్యంగా కాస్తావేమో-చటుక్కున చన్నీళ్ళు పోసుకుందామని చూస్తాను. ఈ మధ్య కాలంలో నాకు నూతి నీళ్ళ భాగ్యమే దక్కటం లేదమ్మాయ్।" అని నవ్వాడు జగన్నాధం.

"బలే వారే బాబుగారూ!" అని పకపకా నవ్వింది వెంకమ్మ.

ఆయన స్నానం చేసి వచ్చేసరికి పనిమనిషి అంట్లు తోమటం పూర్తయింది. దొడ్డి ఊడుస్తోంది. అన్నపూర్ణ చిట్టి తప్పేల గోలెంలో కలగలుపుతోంది.

ఆయన పంచె కట్టుకు వచ్చి తడి తువ్వాలు బయట తాడుమీద ఆరవేశాడు. అన్నపూర్ణ పాలు పితుకుతోంది. వెంకమ్మ దూడని గట్టిగా పట్టుకుంది. "ఉండవే ముండకానా।...." అని దూడని ముద్దు ముద్దుగా తిడుతోంది.

అప్పటికి బాగా తెల్లవారింది, సూర్య కిరణాలు చెట్ల సందుల్లోంచి చొచ్చుకు వస్తున్నాయి. మొక్కలు తలలూపుతున్నాయి.

జగన్నాధం పది నిమిషాల సేపు అక్కడే నిలబడి సూర్య నమస్కారాలు చేసాడు.

"ఇక చాలు దాన్ని వదిలెయ్।" అని పాల చెంబు తీసుకుని లేచింది అన్నపూర్ణ.

"అదేంటమ్మగోరూ। చెంబు మీంచి పాలు పొర్లాల. అన్ని పాలు దూడ కొదిలేత్తారేంటి?" అంది వెంకమ్మ.

అన్నపూర్ణ నవ్వింది. "ఫర్వాలేదే....దానిక్కూడా కొంచెం ఉంచాలిగా।" అని పాలచెంబుతో పాక దాటి బయటకు వచ్చింది.

"లోకాని కంతా తెల్లారింది. కాని .... మీ అత్తగారికి మాత్రం...." జగన్నాధం మాటలింకా పూర్తి కాలేదు.

"....ఆ।। ఆ।।....యిక్కడే ఉన్నాను।"

అంతా అటు తిరిగారు. గుమ్మంలో నిలబడి వుంది మహా లక్ష్మి.

"అబ్బోబ్బో! అప్పుడే లేచేసారే!....మరో క్షణంలో మహాలక్ష్మి సుప్రభాతం పాడదామనుకుంటున్నాను!" అన్నాడు జగన్నాథం పరిహాసంగా.

"ఇప్పుడయితేనేం పాడండి....మరి కాసేపు పడుకుంటాను!" అందావిడ మూతి త్రిప్పుతూ.

అంతా నవ్వుకున్నారు.

"పడుకుంటావ్—నీకేం మహారాణివి!" అన్నాడు జగన్నాథం ఎగతాళిగా.

"ఊ! నాతో పొద్దున్నే వాదం వేసుకోపోతే....వెళ్ళి మీ మనవణ్ని, మనవరాల్ని లేపకూడదూ!".

"పొరపాటున నాకు పెళ్ళాని వయ్యావు కాని....డి. యి. వో. కావల్సిన దానివి!"

"ఇప్పుడయినా లాభం లేదు-మీరు రిటయిరై పోయారు!"

మళ్ళీ వాళ్ళ నవ్వులు దొర్లాయి. జగన్నాథం భార్య వైపు కొంటెగా చూసి లోపలికి నడిచాడు.

"రామ్మా!....ప్రొద్దున్నే పాలచెంబుతో దర్శనం ఇచ్చావ్ మహాలక్ష్మి లాగ!" అంటూ దొడ్డి గుమ్మం మెట్లు దిగి కోడలి దగ్గరికి వచ్చింది మహాలక్ష్మి. ఆవిడ కళ్ళల్లో కోడలి మీద వాత్సల్యం తొణికిసలాడింది.

"మొహం కడుక్కు రండత్తయ్యా! కాఫీ కలుపుతాను...." అంది అన్నపూర్ణ.

ఆమె చూపులతో హెచ్చరించింది. వెంకమ్మ నీళ్ళ చెంబు తెచ్చి మహాలక్ష్మికిచ్చింది. "ఏమే వెంకీ! మీ అయ్యగారలా అంటా రేమిటే?....తెల్లగా తెల్లారేదాకా పక్కమీద నుంచి లేపటానికి వీల్లే దని కోడలు శాసిస్తే నేనేం చెయ్యను చెప్పు?" అంది మహాలక్ష్మి.

"తలచకు కూతా పించెను పుచ్చుకుంటున్నానని చెప్పెయ్యం డమ్మా!" అని వెంకమ్మ నవ్వింది.

"ఇక వేరే చెప్పాలేమిటి? కోడలే ఇచ్చేసింది." అని తనూ నవ్వి ఆవిడ కదిలింది.

జగన్నాథం ఆదమరచి నిద్రపోతున్న మనవడ్ని తట్టిలేపాడు.

"అప్పుడే తెల్లారిందా?" అంటూ విసుగ్గా లేచాడు మనవడు జగదీష్.

"సూర్యుడ్ని వెనక్కి వెళ్ళమని చెప్పాలేమిట్రా కాసేపు!" అని గలగల నవ్వాడు జగన్నాథం.

ఉడుకుమోత్తనంతో జగదీష్ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ దొడ్లోకి వెళ్ళిపోయాడు. ఈ హడావిడికి మనవరాలు లక్ష్మికూడా లేచింది.

"నువ్వు కాసేపు బజ్జోమ్మా!"

తాతవైపు చురుగ్గా చూసింది లక్ష్మి. "ఏం? అన్న లేచి పోయాడు కాని, నే బజ్జోవాలా?"

"అమ్మమ్మో!....అచ్చి తల్లి కంత కోపం వచ్చేసిందే!" అంటూ ఆ పిల్ల నెత్తుకొని దొడ్లోకి తీసుకువెళ్ళాడు జగన్నాథం.

అప్పటికి వీధరుగులు తుడిచి....ముంగిట్లో కల్లాపి జల్లింది వెంకమ్మ. వాకిట్లో పక్కలు ఎత్తుతున్న అన్నపూర్ణ దగ్గరకువచ్చి "ముగ్గేసి రండమ్మా!" అంది.

"నువ్వేయకూడదే?" అంది అన్నపూర్ణ.

"మీరే స్తేనే బావుంటుంది!" అని నవ్వింది వెంకమ్మ ముగ్గు బుట్ట చేతికందిస్తూ.

ఇద్దరికీ నిత్యం ఇదే వాదులాట! అన్నపూర్ణ పీటగుమ్మంలో ముగ్గుపెడుతుంటే ఎదురిళ్ళ వాళ్ళు, పక్కిళ్ళవాళ్ళు....కళ్ళింత చేసు కొని చూస్తుంటారు. రోజూ చూసే దృశ్యమే అయినా ఏనాటికానాడు అది ఒక వింతే వాళ్ళకి!....అందులో పొరుగిళ్ళ ఆడవాళ్ళకి కలిగే ముచ్చటేమంటే....ఆ ముంగిట్లో నిన్న కనిపించిన ముగ్గు ఈవేళ కనిపించదు. ఈ వేళది రేపు కనిపించదు! పెట్టిన ముగ్గు పెట్టకుండా ఎన్నాళ్ళయినా క్రొత్త క్రొత్త ముగ్గులు పెట్టగలదు అన్నపూర్ణ! సరదా ఉంది, చాకచక్యం ఉంది.

మరో ముచ్చటేమిటంటే—ముగ్గుపెట్టేవేళ అనేక ఇళ్ళ

ముందరి ఆడవాళ్ళల్లా చింపిరి తలతో, నలిగిన బట్టలతో ఉండదామె. అప్పటికే స్నానం అదీ చేసి, జుట్టు ఒబ్బిడిగా ముడివేసుకొని ఉంటుందేమో....లక్ష్మీకళ ఉట్టిపడుతూ ఉంటుంది! ఆమె పెట్టే ముగ్గునేకాదు....ముగ్గుపెట్టే ఆమె చేతిని కూడా చూసి కన్నుల పండుగ చేసుకుంటారు ప్రేక్షకులు.

మహాలక్ష్మి ముఖం కడుక్కొని వీధి గుమ్మంలోకి వచ్చింది. పూజారిగారి కోడలు కామాక్షి బిందె పట్టుకొని అలాగే నిలబడింది. వీధి చివరి రాయప్పచౌదరిగారి పెద్దకూతురు రత్తాలు ఉన్నచోటనే బొమ్మలా నిలబడిపోయింది!....ఇంక ఎదురిళ్ళవాళ్ళు, పక్కిళ్ళవాళ్ళు సరేసరి... రానా మానా....అన్నట్టు మెట్లమీద నిలబడి పోయారు. పాలమ్మి నూకాలు బుట్ట క్రిందికి దింపి మరీ కూర్చుండిపోయింది! దీనికంతకీ కారణం అన్నపూర్ణ ముగ్గుపెట్టటం!

"ఏమే రత్తాలూ! ఎక్కడికెడుతున్నావేమిటే?" అంది మహాలక్ష్మి నవ్వుతూ.

చేతిలో చెంబు చూసుకుని, "మర్చిపోయాను!" అని సిగ్గుగా నవ్వుకుంటూ హడావిడిగా వెళ్ళిపోయింది రత్తాలు.

ఆ మాటలు విన్న కామాక్షి బిడియంగా మహాలక్ష్మి వైపు చూసి నవ్వి తనూ కదలి చెఱువు వైపు వెళ్ళిపోయింది.

"మాకు పాలక్కర్లేదే నూకాలూ!" అని మేలమాడింది మహాలక్ష్మి.

"ముగ్గు సూత్తున్నా నమ్మగోరూ!" అని ముసిముసిగా నవ్వింది నూకాలు.

అన్నపూర్ణ ముగ్గుపెట్టడం పూర్తయింది. అత్తగారివైపు చూసి నవ్వి లోపలికి నడిచింది.

"ఓయి మీ యిళ్ళు బంగారంగానూ! అలా నిలబడి పోయారేంట్రా? మీ పన్లు కానివ్వండి!" అని వీధిలో నిలబడిపోయిన అమ్మాయిలందర్నీ హెచ్చరించింది మహాలక్ష్మి.

ఈ చోద్యమంతా చూస్తున్న పక్కింటి రామరాజుగారి ఇల్లాలు మంగమ్మ ఓ అడుగు వీళ్ళ గుమ్మంలోకి వేసి, "చూడు వదినా! ఈ తప్పు వాళ్ళదికాదు....నీ కోడల్ది!" అని నవ్వింది.

"పోనీ, వాళ్ళని నేర్చుకోమనరాదూ?" అంది మహాలక్ష్మి.

"ఎందుకులే! అన్ని పనులూ మానేసి ఇక ముగ్గులెడుతూ కూర్చుంటారు....నీ కోడలికున్న ఓర్పూ, చురుకుతనం ఎవళ్ళకొస్తుం దమ్మా!....ఏమయినా నువ్వదృష్టవంతురాలివి!"

"ఊఁ! నీ దిష్టే తగిలేను-పోమ్మా!"

"నా దిష్టి తగిలేది నీ కోడలికా? నీకా?"

ఇద్దరూ పగలబడి నవ్వుకున్నారు.

"వస్తా మరి! కోడలు కాఫీ కలుపుతోంది...." అని లోపలికి నడిచింది మహాలక్ష్మి.

అప్పటికి సూర్యం పడుకున్న గది తప్పించి ఇల్లంతా ఊడ్చింది వెంకమ్మ.

"మరిక నేనెళ్ళొత్తా నమ్మగోరూ!"

"ఉండవే! నువ్వూ ఓ గుక్క కాఫీ తాగి వెడుదువుగాని" అంది అన్నపూర్ణ.

అప్పటికి పాలదాలిలో పాలు బాగా కాగాయి. ఫిల్టరులో డికాషన్ దిగింది. గిన్నెడు కాఫీ కలిపింది అన్నపూర్ణ.

ముఖాలు కడుక్కుని అంతా వచ్చారు

"నీళ్ళు మరిగిపోతున్నాయి. నేనుకూడ నీళ్ళు పోసుకోనేమిటే పూర్ణా!" అంది మహాలక్ష్మి.

"కాఫీ తాగి మరీ వెళ్ళండత్తయ్యా!"

"వెళ్ళనియ్యమ్మా! కూర్చుందంటే మరిహాకదద్దు...." అన్నాడు జగన్నాధం.

"మరి కాసేపట్లో అరుగుమీదకి చేరతారు. అప్పుడు రోజంతా కదలనిది మీరో నేనో చూస్తానుగా?"అని భర్తని పరిహాసం చేసింది మహాలక్ష్మి.

ముసిముసిగా నవ్వుకుంటూ కాఫీ గ్లాసుతో వీధరుగుమీదకి వెళ్ళిపోయాడు జగన్నాధం.

"అమ్మా! నాకూ కాఫీ యియ్యవే!" అన్నాడు జగదీష్.

అన్నపూర్ణ గ్లాసు అందించింది.

"ఇవి పాలు!" అన్నాడు వాడు ముఖం ముడుచుకుంటూ.

"అవును. చిన్నపిల్లలవే తాగాలి!" అంది అన్నపూర్ణ.

"రోజూ పాలేనేంటి?"

"పోనీ, ఓ చుక్క కాఫీ పొయ్యమ్మా!" అంది మహాలక్ష్మి.

"మీరలా గారం పెట్టకండత్తయ్యా!...." అంది అన్నపూర్ణ.

ఆమె దేవికో అటు తిరగ్గా చూసి జగదీష్ పాలగ్లాసులో ఏన గ్లాసులోని కాఫీ కొంచెం వొంచి త్రాగమన్నట్టు మనవడిని సంజ్ఞ చేసింది మహాలక్ష్మి. వాళ్ళ ముఖభావాలు గుర్తించి సంగతి గ్రహించింది అన్నపూర్ణ. ఇద్దర్నీ మార్చిమార్చి చూసి చిన్నగా నవ్వింది. పట్టుపడిన దొంగలుకూడా నవ్వారు.....వాళ్ళంతా ఎందుకు నవ్వారో తెలియకపోయినా తనూ నవ్వాలనుకొని చంటిపిల్ల లక్ష్మికూడా నవ్వింది.

# 2

ఎనిమిది గంటలు కావస్తోంది.

కుడివైపు అరుగుమీద పిల్లలకి ప్రైవేటు చెపుతున్నాడు జగన్నాథం. పిల్లలంటే ఎంతోమందిలేరు, నలుగురైదుగురు. పక్క పక్క యిళ్ళవాళ్ళు, చిన్నక్లాసు పిల్లలు. జగన్నాథం మాస్టారంటే పిల్లలకీ గురి ఉంది, వాళ్ళ పెద్దవాళ్ళకీ గురి ఉంది. స్కూల్లో పని చేసే రోజుల్లో ప్రొద్దున్నపూట పిల్లల ప్రైవేటు ఓ వెడవగా ఉన్నా ఆయన రిటయిరయ్యాక అప్పటి అలవాటు ఇప్పటి కాలక్షేపానికి పనికి వస్తోంది.

అందుకు ప్రతిఫలంగా ఆయనెప్పుడూ ఆశించిందీలేదు, పిల్లల తల్లిదండ్రుల్ని అడిగిందీలేదు. అయితే వీళ్ళు ఏదో ఒక విధంగా వీలయినప్పుడల్లా వస్తురూపంలో ఆయనకి ప్రతిఫలం ముట్టచెప్తుంటారు. ఈ విషయంలోనే కాదు, ఏ విషయంలోనయినా పల్లెటూళ్ళల్లో డబ్బుకంటే వస్తువుకే విలువెక్కువ. ఒకరి దొడ్లో పది అనపకాయలు కాస్తే పదిళ్ళవాళ్ళు పంచుకొంటారు. మునగచెట్టు ఒక్కరిదన్న పేరేకాని దాని కాడలు అంతా రుచిచూసేవాళ్ళే! కొన్ని కొన్ని పట్నంనుంచి వచ్చే కూరల వాళ్ళకి అమ్మినా, ఇంకా కొంత

పంచిపెట్టుకుంటావికి ఉంచుకుంటూనే ఉంటారు. తరతరాలుగా వస్తున్న మంచి అలవాటది!....అందుకనే ప్రతిఫలం వస్తురూపంగా చూపెంచ టంలో ఇచ్చేవాళ్ళకేకాదు-పుచ్చుకునే వాళ్ళకూ్కడా మక్కువే! కారణం ఆ వస్తువు వెంట వాళ్ళ అభిమానంకూడా తోడు ఉంటుంది. ఇది పల్లెటూళ్ళలోని మనుషులకు మనుషులకు మధ్యనున్న అను బంధాలకి ప్రతిరూపం.

"దండాలు బాబుగారూ!"

మనవడు జగదీష్ చేసిన లెక్కని చూస్తున్న జగన్నాధం తల ఎత్తాడు."ఓహో బ్రహ్మం! రా రా. ఇంకా రాలేదేమిటా అని చూస్తు న్నాను". అని అతవి చేతిలోని బుట్టచూపి నవ్వి లోపలికి వెళ్ళ మన్నట్టు చేయిఊపాడు.

చిరునవ్వు నవ్వి. కంసాలి వీరబ్రహ్మం మెట్లెక్కి ఇంటి లోపలికి వెళ్ళాడు.

"అమ్మగారూ!" అని పిలిచాడు. అన్నపూర్ణ వచ్చింది. కూరల బుట్ట అందించాడు బ్రహ్మం.

"ఎందుకయ్యా ఇన్ని?" అంది అన్నపూర్ణ.

"అదేమో నాకు తెలీదు. మాణిక్యం ఇచ్చిరమ్మంది. మీకిచ్చాను, నా పనయిపోయింది." అని ద్వారబంధం ప్రక్కన గోడకు వ్రేలాడుతున్న తాళంచెవి తీసుకున్నాడు బ్రహ్మం.

"ఉండు. కొంచెం కాఫీత్రాగి పనిలోకి దిగుదువుగాని."

"ఇప్పుడే మాణిక్యం ఇచ్చింది అమ్మగారూ! తాగొచ్చాను."

"మీ ఆవిడిస్తేనేంలే. మళ్ళీ త్రాగకూడదా?" అంది అన్న పూర్ణ నవ్వుతూ.

"అప్పుడే అయిందేంటి లెండి? మళ్ళీ ఓ గంటలో పెద్దయ్య గారికి ఇస్తారుగా! అప్పుడు నావాటా నాకెలాగా ఉంటుంది!" అని నవ్వి అరుగుమీదకి నడిచాడు వీరబ్రహ్మం.

ఎడంవైపు అరుగు నానుకొని కొట్టుగది ఉంది. జగన్నాధం గారి పాత సామానుతోపాటు కంసాలి వీరబ్రహ్మం బంగారం పని ముట్లుకూడా అందులోనే ఉన్నాయి. తాళంతీసి సామాను బయిట పెట్టుకొని ఆనాటి పని ప్రారంభి.చాడు బ్రహ్మం. తానా యింటికి

వచ్చిన మొదటిరోజు గుర్తుండని రోజుండదతనికి. అన్నపూర్ణకి మనసులో దండం పెట్టుకున్నాకనే తన బంగారం పనిముట్లని కళ్ళ కద్దుకుంటాడు! అతనికి అన్నపూర్ణ ఆరాధ్యదేవత! దానిక్కారణం వుంది....

వీరబ్రహ్మం బ్రతికి చెడ్డవాడు. పూలమ్మిన చోటనే కట్టె లమ్మలేక ఉన్న వూరొదిలిపెట్టి ఈ వూరొచ్చాడు. ఎక్కడేనా తల దాచుకోటానికి కాస్త జాగా ఉంచేచాలు అని అనుకున్నాడు. కాని, ముక్కూ మొహం తెలియని వాడికి ఆశ్రయం ఇవ్వటానికి ఆ ఊళ్ళో ఎవ్వరూ ముందుకు రాలేదు.

అన్నపూర్ణ అత్తవారింటికి వచ్చిన క్రొత్త రోజులవి. వీధి గుమ్మంలో వీరబ్రహ్మం తనుపడ్డ అగచాట్లు గురించి అత్తమామల తోటి, భర్తతోటి చెపుతుంటే లోపలి గుమ్మంలో నిలబడి అన్నీ వింది అన్నపూర్ణ. బ్రహ్మాన్ని ఉండమనలేక-పొమ్మనలేక సందిగ్ధంలో పడివున్న అత్తింటివారిని చూసింది. తలదించుకొని బ్రహ్మం పక్కన నిలబడిన మాణిక్యం చిన్నబోయిన ముఖంచూసింది....ఆమె చేతుల మధ్య బిక్కచిక్కిన చిన్నపిల్లవాడినీ చూసింది.

చటుక్కున గుమ్మంలోకివచ్చి "నేనొక్కమాట చెప్పనా అత్తయ్యగారూ?" అంది.

"చెప్పమ్మా?" అంది మహాలక్ష్మి.

"వాళ్ళముఖాలు చూస్తుంటే నిజం చెపుతున్నారనే నాకని పిస్తోంది. మనం కొస్త జాగా చూపిద్దాం. ఆ మంచిని నిలబెట్టు కోవటం వాళ్ళ బాధ్యత." అంది అన్నపూర్ణ.

ఆమె చెప్పిన మాటలు అందరికీ నచ్చాయి.

"మీపేరు చెప్పుకొని రోజూ మాయింట దీపం పెట్టుకుంటాం అమ్మగారూ!" అంది మాణిక్యం ఆనందబాష్పాలతో.

అప్పట్నించీ అరుగుమీదే తనకొట్టు పెట్టుకున్నాడు వీర బ్రహ్మం. దొడ్డివైపు పంచక్రింద మాణిక్యం వంటావార్పూ కాని చ్చేది....ఇది పదేళ్ళక్రితం నాటి మాట.

వాళ్ళమాట వాళ్ళు నిలబెట్టుకున్నారు. అన్నపూర్ణ మాట మంచి తనం కాపాడారు. ఆ యింటి మర్యాద నిలబెట్టారు. చూస్తుండగానే

ఊళ్ళో అందరిచేతా నమ్మకస్తు లనిపించుకున్నారు. పదివాసుల బంగారం పనికూడా అతని చేతిలోపెట్టి కళ్ళుమూసుకోవచ్చునని ఊళ్లోవాళ్ళనుకుంటున్నారిప్పుడు.

దానితో జగన్నాథం మాటమీద ఎవరో పుణ్యాత్ములు కాస్త కాళీజాగా చూపించారు. అక్కడ పాక వేసుకొని కాపురం మార్చాడు బ్రహ్మం. తర్వాత్తర్వాత కొంచెం కొంచెం డబ్బు చెల్లిస్తూ ఆ స్థలాన్ని కొనుక్కున్నాడు. ఎంతోకాలం ఆపాక పాకలా ఉండిపోలేదు. ఇంటి కప్పుమీద వేసినవి తాటాకులే అయినా ఇల్లు ఎత్తు చేసుకున్నాడు. చుట్టూ మట్టిగోడలు పెట్టుకున్నాడు. తనకూ ఒక మంచి యిల్లు ఉందన్న తృప్తికలిగింది. ధైర్యం వచ్చింది.

బంగారం పనికూడా ఇంటికే మార్చుకుందామని అనుకున్నాడు కాని-ఆ మాటచెప్పిన రోజున. "ఇప్పుడు మాయిల్లు నచ్చలేదేంటోయ్?" అని జగన్నాథం అనేసరికి తెల్లబోయాడు బ్రహ్మం.

"ఎంత మాట బాబుగారూ! ఇన్నేళ్ళు మీ పంచనబడి బతికాను. ఇంక మీకిబ్బంది కలిగించడం ఎందుకని మాయింట్లో పెట్టుకుంటానన్నాను. కాని నాకుమాత్రం వెళ్ళాలని ఉందా?" అన్నాడు.

"మాకంతగా ఇబ్బందిగా ఉంటే అప్పుడే వెడుదువుగానిలే!" అంది మహాలక్ష్మి.

"ఊరు చివరుంది మీయిల్లు. ఇక్కడుంటే నలుగురూ వచ్చేపోయేవాళ్ళు కనిపిస్తారు. మంచి బేరాలు వస్తాయి" అంది అన్నపూర్ణ.

వీరబ్రహ్మం, అవాక్కయిపోయాడు. మాణిక్యం కళ్ళల్లో అప్పుడూ ఆనందబాష్పాలు నిలిచాయి. "మా చర్మంతో చెప్పులు కుట్టిచ్చినా మీఋణం తీరదమ్మగారూ!"

"పోవే పిచ్చిమొద్దూ!" అని మందలించింది మహాలక్ష్మి.

ఆ విధంగా వీరబ్రహ్మం ఆ అరుగుమీదే స్థిరపడిపోవటం జరిగింది. 'అన్నపూర్ణ' మాయింటి ఇలవేలుపు అని-చెప్పుకుంటుంది మాణిక్యం. తెలియనివాళ్ళు కాశీ అన్నపూర్ణ కాబోలనుకుంటారు. తెలిసిన వాళ్ళకి ఆమె పూర్తిపేరు 'కాశీ అన్నపూర్ణ' అనికూడా తెలుసు! వీరబ్రహ్మం కుటుంబానికీ, ఆ యింటికీ అంతటి బంధం ఏర్పడింది. మాణిక్యం ఊర్కే కూర్చోదు. ఎక్కడో తోటలో పని

చేస్తుంది. వచ్చేటప్పుడు ప్రతిపూటా ఏదో ఒక కూరతెస్తుంది. బ్రహ్మం చేతికిచ్చి పంపుతుంది. గుళ్ళోకివెళ్ళే ముందు భక్తుడు పూలు తీసుకువెళ్ళినంత సంబరంతో అవి తెచ్చి యిస్తాడు బ్రహ్మం!

కుడి అరుగుమీద జగన్నాథం ప్రైవేట్లు, ఎడమ అరుగుమీద వీరబ్రహ్మం బంగారం పని—అప్పటికా అరుగులకి నిండు తనం వస్తుంది. దారివెంట పోయేవారికి ప్రొద్దుటివేళ అదొక చూడ ముచ్చట! తర్వాత మాస్టారు స్కూలుకి వెళ్ళిపోయినా వీరబ్రహ్మం పనిమాత్రం అవిరామంగా సాగిపోతూనే ఉండేది. వచ్చేపోయే జనంతో ఆ అరుగులమీద రోజంతా సందడిగానే ఉండేది. వాళ్ళిద్దర్లో ఎవరయినా ఊరికివెళ్ళో, ఒంట్లో బాగుండకనో ఆపూట కనిపించకపోతే అరుగులు బోసిపోయినట్లుండేవి. అంతలా చూడ్డానికి ఏళ్ళ తరబడీ అల వాటు పడిపోయారు జనం.

ఆ మధ్య జగన్నాథం రిటయిరయినాక మరింత సందడి పెరిగింది. ప్రైవేట్లయి పోయాక పిల్లలు బడికి వెళ్ళిపోయాక....ఆయనకి బొత్తిగా ఏమీ తోచేదికాదు! ఒక్కడూ ఎంతసేపని బ్రహ్మంతో కబుర్లు చెప్తాడు? అందుకని, ఇదివరలో రామాలయం అరుగుల మీద కూర్చుని కబుర్లాడుకునే చిరకాల మిత్రుల్ని తిన్నగా ఇంటికే లాక్కువచ్చి కూర్చోపెట్టుకున్నాడు. చతుర్ముఖ పారాయణం ఆరంభ మయింది! దానితో యిక రోజంతా ఎడాపెడా సందడే!

"ఏవోయ్ బావా! ఇంకా ప్రైవేట్లు కాలేదూ?" అంటూ వచ్చాడు పక్కింటి రామరాజు.

"ఆఁ! అయిపోవచ్చె! రా కూర్చో!...." అని చాపమీద జరిగి చోటిచ్చాడు జగన్నాథం.

జేబులోంచి చుట్టతీసి ముట్టించుకొని మరోటి జగన్నాథం నోట్లోపెట్టి తానే నిప్పు ముట్టించాడు రామరాజు. "ఇంక చదువులు చాలు కాని వెళ్ళండర్రా! బడికి టయిమవుతోంది!" అన్నాడు.

అందుకోసమే చూస్తున్నట్టున్నారు పిల్లలు. సంతోషంగా పుస్తకాలు పుచ్చుకొని పరిగెత్తుకు పోయారు.

అప్పుడే గుమ్మంలోకి వచ్చింది మహాలక్ష్మి.

"కులాసాగా ఉన్నావా చెల్లెమ్మా!" అని పలకరించాడు రామరాజు.

"ఆఁ!....నీకూ, మీ బావగారికీ తెల్లారిందా?" అని నవ్వింది ఆమె.

"ఏదీ? ఇంకా రావల్సిన వాళ్లు రాందే?" అన్నాడు జగన్నాధం అరుగుమీదనుంచి వీధిలోకి తొంగిచూస్తూ.

"పోనీ, అందాకా నువ్విలా రావోయ్ బ్రహ్మం! ఓ ఆట వేద్దాం." అన్నాడు రామరాజు.

"ఏదో సామెత చెప్పినట్లు శుభ్రంగా పని చేసుకునే వాళ్ళెందుకు చెరుపుతా రన్నయ్యా?" అంది మహాలక్ష్మి.

"చూసావోయ్ రాజూ! మీ చెల్లెలు నన్నూ, నిన్నూ గాపిదలంటోంది!"

"గుమ్మడికాయ దొంగలంటే భుజాలు తడుముకుంటా రెందుకు?" అని భర్తని ఎగతాళిచేసింది మహాలక్ష్మి.

"పోనీ, కాసేపు నువ్వు కూర్చో కూడదూ?" అన్నాడు జగన్నాధం నవ్వుతూ.

"ఇంకా నయం?....రోడ్డుమీద వచ్చేపోయే వాళ్ళంతా మనన్నే చూస్తూ కూర్చుంటారు!" అని నవ్వింది ఆమె.

అప్పుడే సూర్యం సైకిలు తీసుకొని బయటకు వచ్చాడు.

"ఏంరోయ్! అప్పుడే బ్యాంకుకి వెళ్ళే వేళయిందేంటి?" అని రామరాజు పలకరించాడు.

ఆ ఊరికి ఐదుమైళ్ళ దూరంలో వెంకటాపురం ఉంది. అక్కడ కో ఆపరేటివ్ బ్యాంకులో అక్కౌంటెంటుగా పని చేస్తున్నాడు సూర్యం. బ్యాంకు పనయిపోయాక ఓ బట్టలకొట్లో పద్దులు రాస్తుంటాడు.

"ఈవేళ కొంచెం కొట్లో పనుంది మామయ్యా!" అన్నాడు సూర్యం సైకిలువైపు చూసుకుంటూ.

"ఆఁ! ఏంలేదు....నీ కంతగా అర్జంటు లేకపోతే ఓ ఆట వేద్దామని!" అని నవ్వాడు రామరాజు.

"వాడికీ పేకాట పడదులే అన్నయ్యా! వెళ్ళనీ!" అంది మహాలక్ష్మి.

ఎందుకో సూర్యం ముఖం ఎర్రనయింది. చటుక్కున తల త్రిప్పుకొని సైకిలెక్కాడు. మరుక్షణంలో సైకిలు కను మరుగయి పోయింది.

"ఏమిటోయ్ బావా! ఈపూట మనకంతా చుక్కెదురయ్యేలా ఉందే!"

"మరేం భయం లేదన్నయ్యా!....ఇంకోక్షణంలో ఏ నారాయుడో రానే వస్తాడు."

మహాలక్ష్మి మాటలింకా పూర్తికాలేదు. తల్చుకున్న మనిషి రానే వచ్చాడు.

"చెల్లెమ్మ ఇప్పుడే అంటోంది నీమాట. నీకు నూరేళ్ళాయుష్షోయ్ నారాయుడూ!" అన్నాడు రామరాజు.

"దేశ నాయకులంతా జనాభా పెరిగిపోతోందని గోలపెట్టేస్తుంటే మేం ఒక్కొక్కళ్ళం వందేళ్ళు బతికేస్తే ఎలాగ మా లక్ష్మమ్మ తల్లీ?" అని నవ్వి నారాయుడు కూడా చాపమీదకి చేరాడు.

మహాలక్ష్మి నవ్వి లోపలికి వెళ్ళిపోయింది.

మరుక్షణంలో పరంధామయ్య కూడా వచ్చాడు. నాల్గుచేతులూ కలిసాయి. పేకాట పారాయణ ప్రారంభమయింది.

రామరాజుకి బంగారంలాంటి మాగాణీ పొలంఉంది. కొడుకు లిద్దరూ పొలం పనులు చూసుకోవటం మొదలుపెట్టాక తనకు తానే రిటయిరుమెంటు ఇచ్చేసుకున్నాడతను.

నారాయుడు చీకటితో పొలంవెళ్ళి పని చూసుకొని వచ్చేస్తాడు. నలభయ్యేళ్ళుగా అతని టైంటేబిల్‌లో మార్పులేదు. ఎటొచ్చీ ఇదివరకు రామాలయం అరుగుమీద కూర్చుని ఎవరితోనో కబుర్లేసుకునేవాడు. ఇప్పుడు జగన్నాధంగారి అరుగుమీద కాలక్షేపం-అంతే తేడా! మళ్ళీ మధ్యాహ్నం భోజనం వేళదాకానే ఆ తీరిక. అప్పుడు పొలం వెళ్ళాడంటే మరిక సాయంత్రం చీకటి పడేదాకారాడు.

పరంధామయ్య కూడా స్కూలు మాస్టరుగాచేసి రిటయిరయ్యాడు. జగన్నాధంకీ, అతనికీ చదువుకున్న రోజులప్పట్నుంచి

స్నేహం....మధ్యాహ్నం వేళ నారాయుడు లేనప్పుడు, మరెవరయినా అటొ స్తే కూర్చోపెట్టేస్తారు వాళ్ళు. లేకపోతే....జగన్నాధం, రామ రాజు, పరంధామయ్య... ఆ ముగ్గురే ఆటలేస్తారు. రోజంతా ఆడినా వాళ్ళకి విసుగవిపించదు. మధ్యాహ్నం భోజనాలుచేసి కాసేపు కునుకు తీస్తారన్న పేరేకాని....మళ్ళీ ఏదో అర్థంతరంగా 'ఆఫీసు డ్యూటీ' వదిలిపెట్టిపోయిన ఉద్యోగస్తుల్లా హడావిడిగావచ్చి పడతారు. బయట మండు టెండలయినా సరే-వర్షం కొట్టి కురుస్తున్నా సరే....అంత అలవాటయిపోయింది వాళ్ళకీమధ్య!

ఇంటి లోపలికివచ్చిన మహాలక్ష్మి కోడల్ని అడిగింది. "ఏమిటే అమ్మాయ్! పెద్దాడు అన్నం తినకుండానే వెళ్లాడు?"

"కొట్లో పనుందట'" అంది అన్నపూర్ణ తల త్రిప్పుకుంటూ.

"ఆ మాట రాత్రి చెప్పకపోయాడా? ప్రొద్దున్నే ఇంత ఉడ కేసే దానివి!"

అన్నపూర్ణముఖం ఎర్రనయింది. ఆమె పలకలేదు.

"ఏం పనులో ఏమిటో? అన్నం పీక్కూకూడా మావి సంపా దించాలా?....సర్లే ఏమయినా పెట్టావా?"

"ఉప్మా చేసిపెట్టాను."

గాఢంగా విట్టూర్చింది మహాలక్ష్మి.

మరి కాసేపటికి కాఫీలు కలిపింది అన్నపూర్ణ. అవి తీసుకొని అరుగుమీదకివచ్చింది మహాలక్ష్మి. "తీసుకోండన్నయ్యా!" అవి ముందు కూర్చున్న రామరాజు దగ్గర పెట్టింది.

"చూడండయ్యా! మహాలావు కష్టపడి పోతున్నామని కాఫీలు పట్టుకు వచ్చింది మాలక్షమ్మ!" అన్నాడు నారాయుడు.

"ఓయి నీ అసాధ్యం కూల! ఇదిమాత్రం కష్టం కాద టోయ్?" అన్నాడు జగన్నాధం నవ్వుతూ.

"ఇన్ని మాటలెందుకు? ఆవిడ ఇవ్వక మానుతుందా—మనం త్రాగక మానతామా?....తాగండి - తాగండి!" అని పరంధామయ్య తనో గ్లాసందుకోబోయాడు.

"ముందు ముక్కేసి మరీ గ్లాసందుకోవోయ్!" అన్నాడు రామ రాజు.

"చిన్న పిల్లల్లా మీ తగవులాటలు బాగున్నాయి. ముందు కాఫీలు తాగండి. చల్లారిపోతాయి...." అని నవ్వింది మహాలక్ష్మి.

మరో గ్లాసుతో ఆమె రెండో అరుగుమీదికి రాబోతుంటే "....నేనే వస్తున్నానుండండమ్మా!"అని వచ్చి అందుకున్నాడు వీరబ్రహ్మం.

కాఫీలు త్రాగారో లేదో కూడ తెలియకుండా వాళ్ళు మళ్ళీ పేకాటలో పడిపోయారు. ఎవరో ఒకామె నగ బాగుచేయించుకోటానికి వచ్చింది. ఆమెతో కబుర్లలో పడింది మహాలక్ష్మి.

ఇంతలో పెద్ద శబ్దంచేస్తూ సైకిలొకటి వచ్చి గుమ్మంలో ఆగింది. అందరిదృష్టి అటు తిరిగింది. సైకిల్‌మీద వచ్చిన కుర్రాడు శేషగిరి, పద్మనాభం కొడుకు. పద్మనాభం పరంధామయ్యగారి కొడుకు. ఆయన కోడలు రుక్మిణి.

"ఏంరా శేషూ! ఏమిట్రా హడావిడి? పడిపోతావ్!" అంది మహాలక్ష్మి.

"వాడెప్పుడూ అంతేనమ్మా!....ఏంరా ఏమయింది?" అడిగాడు పరంధామయ్య.

"నాన్న వచ్చేసాడు తాతయ్యా! పట్నంలో సీనుమామయ్య. పిన్ని కన్పించారంట. రేపొస్తారట!" అని చెప్పాడు శేషగిరి.

ఆ కబురు విని మహాలక్ష్మి పరమానందపడింది. "ఒరేయ్! ఒక్క క్షణం నిలబడరా...."

ఆమె మాటలు పూర్తి కాకుండానే, "....ఇంకాసేంట్లో మా నాన్నొచ్చి అన్నీ చెబుతాడులే అమ్మమ్మా!" అని తుర్రుమని సైకిలు పోనిచ్చేసాడు శేషగిరి.

"ఓరి వీడి యిల్లు బంగారంకాను! చెప్పేదేదో పూర్తిగా చెప్పకుండా పోయాడు." అని గొణుక్కుంది మహాలక్ష్మి.

"కావల్సిన కబురేదో చెప్పనే చెప్పాడుగా చెల్లెమ్మా! శ్రీనివాసు, భవాని వస్తున్నారు. ఇక ఇల్లంతా కావల్సినంత సందడి!" అని నవ్వాడు రామరాజు.

"ఏవోయ్ బావా! తెలియకడుగుతాను....మన శ్రీనివాసు డాక్టరీకోర్సు ఇంకయిపోయినట్టేగా?" అన్నాడు నారాయుడు-జగ

న్నాధంవైపు చూస్తూ.

"ఇంకెంత? ఆర్నెల్లు!" అన్నాడు పరంధామయ్య-అవునా-అన్నట్టు జగన్నాధంవైపు చూస్తూ. జగన్నాధం తల పంకించాడు.

"మరి ప్రాక్టీసు ఎక్కడ పెడతాడు?" అని అడిగాడు నారాయుడు.

"ఇంకెక్కడ పెడతాడు? పట్నంలోనే!" అన్నాడు రామరాజు.

"నువ్వూరుకో రాజూ! బావని చెప్పనీ"

జగన్నాధం నవ్వాడు. కాని, జవాబు చెప్పలేదు.

"ఆహా! అలా నవ్వి వూరుకుంటే లాభంలేదు. మనసులోని మాట చెప్పవోయ్ బావా!....పోనీ, నువ్వయినా చెప్పు చెల్లెమ్మా?" అన్నాడు నారాయుడు.

"ఏమో అన్నయ్యా! వాడిష్టం-వాళ్ళ నాన్నగారిష్టం? నాకేం తెలుస్తాయివన్నీ?" అంది మహాలక్ష్మి.

"మన పిచ్చికాని, జగన్నాధం బావ కొడుకుచేత ఈ పల్లెటూళ్ళో ప్రాక్టీసు పెట్టిస్తాడనుకుంటున్నావా? మన సంగతి వాళ్ళకి తెలియదాయేం? ఈ ఊళ్ళో అయితే అన్నీ అరువు బేరాలే!" అన్నాడు రామరాజు నవ్వుతూ.

"అవును. ఇన్ని మొహమాటాలున్నచోట ప్రాక్టీసు పెట్టమని చెప్పటం కూడా మనకి న్యాయంకాదు!" అన్నాడు నారాయుడు.

"మీరిన్ని మాటలు మాట్లాడారుకాని, జగన్నాధం పెదవి కదిపాడా?" అన్నాడు పరంధామయ్య నొసలెగరేస్తూ.

"సమయం వచ్చినప్పుడు తనే బయట పడతాడులే. ముందు ఆట కానివ్వండి." అన్నాడు రామరాజు నవ్వుతూ.

భార్యవైపు చూసి నవ్వాడు జగన్నాధం. "వెళ్ళి కోడలికి కబురుచెప్పు!" అన్నాడు. మహాలక్ష్మి గబగబా లోపలికి నడిచింది.

# 3

వెంకట్రావు న్యూస్‌పేపరు చూస్తున్నవాడల్లా గుమ్మంలోని అడుగుల చప్పుడికి తలెత్తాడు.

భవాని చిరునవ్వులతో లోపలికి అడుగుపెట్టింది. "కులాసాగా ఉన్నావా మామయ్యా?"

"ఆఁ! విశేషంలా ఉన్నాను....ఏమేవ్! మేనకోడలొచ్చింది." అని పొలికేక పెట్టాడతను.

"వస్తున్నా!" అని లోపల్నుంచి మలికేక పెట్టింది వరలక్ష్మి.

"కూర్చోమ్మా!" అని సోఫాలో జరిగి చోటిచ్చాడు వెంకట్రావు.

"వదినేది మామయ్యా?" అంది భవాని కూర్చుని ఇల్లంతా కలయచూస్తూ.

"బట్టలార వేయటానికి డాబామీదికి వెళ్ళిందమ్మా! వస్తుంది... ఏమిటి విశేషాలు?"

"అన్నయ్యా, నేను ఇంటికి వెడుతున్నాం."

వంటింట్లోంచి చీరకొంగుకి చేయి తుడుచుకుంటూ వచ్చిన వరలక్ష్మి ఆ మాటలు వింది. "ఏడీ మీ అన్నయ్య? సామాను తీసుకొని స్టేషనుకి వెళ్ళిపోయాడాయేం?" అంది నవ్వుతూ.

"లేదత్తయ్యా!....వాళ్ళ ప్రొఫెసర్‌తో ఏదో మాట్లాడాలని వెళ్ళాడు. నన్ను సామాను తీసుకొని స్టేషనుకి రమ్మన్నాడు. తానటు వస్తానన్నాడు. ఇంకా బండికి గంటపైనే టైముందిగా? ఈలోగ మీతో చెప్పి వెడదామని వచ్చా.'' అంది భవాని.

"ఊరికి వెడుతున్నారా?"

అంతా అటు తిరిగారు.

డాబా మెట్లు దిగి ఖాళీ బకెట్ చేతబట్టుకొని వచ్చిన సునంద విభ్రాంతపోతూ నిలబడిపోయింది.

భవాని లేచి ఆమె కెదురు వెళ్ళింది. "అవును వదినా! కాలేజీకి సెలవులిచ్చారుగా! ఇంటికి వెళ్ళి చాలా రోజులయిందని వెడదామన్నాను. అన్నయ్య సరేనన్నాడు"

"వెళ్ళండి!'' అంది సునంద ముఖం ముడుచుకుంటూ.

భవాని నవ్వింది. "కోపం వచ్చిందా?''

"నాకెందుకో్కపం?" అంటూ బకెట్ అక్కడ పడేసి రుసరుస లాడుతూ లోపలికి వెళ్ళబోయింది సునంద.

"అమ్మలూ! ఏమిటమ్మా? ఏమయిందసలు?" అని పిలిచాడు వెంకట్రావు.

అదే విసురుతో తండ్రిదగ్గరికి వచ్చింది సునంద. "చూడు నాన్నా, భవానేం చేసిందో! నేనిదివరకే చెప్పాను. అత్తయ్యగారూరికి వెళ్లేముందు నాకు చెప్పమని....నేనూ వస్తానని. ముందు చెప్పలేదు సరిగదా ఆఖరు క్షణంలోవచ్చి వెడుతున్నానని చెపుతోంది. నేరావటం ఇష్టం లేదనేగా?...."

భవాని ముఖం చిన్నబోయింది. "ఛ! అదేంమాట వదినా! మాతో నువ్వు రావటం నాకిష్టంలేదా? అదేమాట నా ముఖంలోకి చూసి చెప్పు!"

"మరి నిన్న సాయంత్రమే వచ్చి నాకెందుకు చెప్పలేదు!" అంది సునంద ఇంకా కోపం తీరనట్టు ముఖంపెట్టి.

"అసలీ శలవులకి వెడదామని నేననుకోలేదు. కోర్సు చాలా ఉండిపోయింది.... నేను బెంగపెట్టుకుంటానని అన్నయ్యెప్పుడూ ఇంటి విషయాలే ఎత్తడు-నీకు తెల్సిందే కదా! ఎందుకో నిన్నరాత్రి అమ్మగురించి, వదినగురించి మాట్లాడ్డం మొదలుపెట్టాడు. పోనీ వెడదామేంటన్నయ్యా-అన్నాను మాట వరసకి. వెంటనే వెడదామన్నాడు. అనుకోకుండా ఇలా ప్రయాణమయ్యాం....వచ్చి నీతో చెప్పే వ్యవధి కూడా లేకపోయింది."

సునంద ముఖంలో నిరుత్సాహం గూడుకట్టింది.

"నన్ను క్షమించు వదినా!" అంది భవాని బాధగా.

"ఓసి నీ ఇల్లు బంగారంగానూ! ఈ మాత్రందానికే క్షమాపణలూ అవీ ఎందుకమ్మా? నీకు వదిన్ని తీసుకువెళ్ళాలని వుంది.... నీకు భవానితో వెళ్ళాలని వుంది! అంతేగా?" అన్నాడు వెంకట్రావు ....వాళ్ళని మార్చి మార్చి చూస్తూ.

ఒకరి ముఖాలింకొకరు చూసుకొని తలలూపారిద్దరూ.

"దీనికి పెద్ద సమస్యేముంది?....బండికింకా పైముంది. త్వరగా ముస్తాబయితే ఎంత సేపు?"

ఇద్దరి ముఖాలు వికసించాయి.

"మా నాన్న మంచినాన్న!" అని అమాంతం తండ్రి చేతులు

రెండూ పట్టుకొని ముద్దుపెట్టుకొని భవాని చేయి పట్టుకొని, తన గది లోకి లేడిలా పరుగెత్తిపోయింది సునంద.

వరలక్ష్మివైపు చూసాడు వెంకట్రావు. "ఏమిటే! అలా బొమ్మలా నిలబడిపోయావ్?"

గాఢంగా నిట్టూర్చి సోఫాలో కూలబడింది ఆమె. "చూస్తున్నాను....మీ తండ్రీ కూతుళ్ళ హడావిడి చూస్తున్నాను!"

ఆమె ప్రక్కన కూర్చుంటూ. "వెళ్ళనిద్దూ. పాపం! దాన్ని నిరుత్సాహపర్చటం ఎందుకు?" అన్నాడు వెంకట్రావు.

"అంటే, మీకింకా ఆ ఆశ మిగిలే ఉందన్నమాట?" అందామె పెదవి విరుస్తూ.

"మా అక్కయ్యకి సునందంటే ఎప్పుడూ ఇష్టమే!" అన్నాడతను బింకంగా.

"ఇష్టం వేరు, చేసుకోవటం వేరు. అయినా, ఆవిడ కిష్టం వుంటే సరిపోదు....మీ మేనల్లుడి కిష్టంకావాలి. ముందా సంగతాలోచించండి!"

"అమ్మాయంటే వాడికీ ఇష్టమే."

"ఆc! తెలుస్తూనే ఉంది ఎంతిష్టమో? ఇంట్లోవుండి చదువుకో మన్నాం. మరి ముందిష్టపడి వచ్చినవాడు ఏడాదిపాటున్నాడో లేదో హాస్టలుకి వెళ్ళిపోయాడు. మనమేమన్నామని వెళ్ళిపోవాలి? పోనీ, భవాని కాలేజీలో చేరాకయినా ఇంట్లోవచ్చి వుండమంటే వేరే కాపురం పెట్టుకున్నాడు. మొదట్నుంచీ అతనికి దూరంగా ఉండాలనే వుంది....ఇంకా ఏం ఆశ పెట్టుకోమంటారు?" అందామె మూతి ముడుచుకుంటూ.

"ఊc! ఆ పాత గొడవన్నీ ఎందుకిప్పుడు? వెళ్ళిన వాడు వెళ్ళినట్టే ఉండిపోయాడా? వారానికోసారి ఇంటికి వస్తూనే వున్నాడుగా! అమ్మాయి, వాడూ ఎంత సరదాగా ఉంటారో చూస్తున్నా నీకింకా సందేహమేనా?"

"మీరిలా మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చోండి. ఆ డాక్టరీ పూర్తయిపోతుంది. ఏ రోజునో ఎవరో అమ్మాయి మెళ్ళో పుస్తి

కట్టేసి....తీసుకొచ్చి ఆశీర్వదించు మామయ్యా అంటాడు! అప్పుడు తెలిసొస్తుంది!'' అందామె వెటకారంగా.

వెంకట్రావు చిరాకుపడ్డాడు. "ఊ!! ఎప్పుడు చూసినా వాడి నాడిపోసుకోవటమే. నీకు కాబోయే అల్లుడని కొంచెం మంచీమర్యాదా లేదు. అమ్మాయి బాధపడుతుందన్న జ్ఞానమూ లేదు."

"నాకు జ్ఞానోపదేశం చేస్తున్నారు.....మీకు జ్ఞానోదయమవుతుంది త్వరలో. మీకే తెలుస్తుంది లెండి!'' అందామె వంటింటివైపు వెళ్ళిపోతూ.

"తీరిగ్గా తర్వాత నాతో తగవులాడుదుగాని. ముందమ్మాయి పట్టుకు వెళ్ళటానికేదయినా యివ్వు!'' అని కేకపెట్టాడు వెంకట్రావు.

మరికాసేపట్లో సునంద సూటుకేసుతో హడావిడిగా బయటకు వచ్చింది.

''చూశావా మామయ్యా! కంగారులో వదిన బట్టలుకూడా సరిగా చూసుకోవటంలేదు!'' సునంద వెన్నుమీద జాకెట్ హుక్స్ పెడుతూ నవ్వింది భవాని.

"వెనక నువ్వున్నావు కదా!'' అంది సునంద ఎర్రబడ్డ ముఖంతో.

"ఒక్క టడుగుతా చెప్పు మామయ్యా! కాలేజీకి వెళ్ళే రోజుల్లో ఏనాడయినా ఇంత త్వరగా తయారయిందా వదిన?''
అంది భవాని.

"అత్తవారిల్లంటే అంత మోజమ్మా ఈ కోడలికి!'' అని వెంకట్రావు కూడా వంతపాడాడు.

"పో నాన్నా!'' అని గారాలుపోయింది సునంద.

"పోయేది మామయ్యకాదు....మనం....పదపద!'' అని తొందరపెట్టింది భవాని.

"అమ్మతో చెప్పాలి...."అంటూ వంటింటివైపో అడుగు వేసింది సునంద.

టిఫిను కేరియరుతో ఎదురు వచ్చిన వరలక్ష్మి. "....అమ్మ ఇప్పటికైనా గుర్తుకు వచ్చింది. మంచిదే!" అంది.

సునంద ముఖం చిన్నబుచ్చుకుంది. "నువ్వొద్దంటే మానేస్తా నమ్మా!" అంది.

"నిన్ను బాధపెట్టిన పాపం నాకెందుకులే! మీ నాన్న పంపు తున్నారు, నువ్వు వెడుతున్నావు....పోనీ, ఎప్పుడొస్తావు? అదయినా చెప్పు?"

భవానివైపు చూపింది సునంద.

"నేను మాత్రం మూడు నాలుగు రోజుల్లో వచ్చేస్తాను అత్తయ్యా!....వదిన సంగతి నాకు తెలియదు!" అంది భవాని ముసి ముసిగా నవ్వుతూ. ఆమెను మోచేత్తో పొడిచింది సునంద.

"మరి త్వరగా బయలుదేరండమ్మా!" అంటూ కొంతడబ్బు కూతురు చేతుల్లో పెట్టాడు వెంకట్రావు.

"వెళ్ళొస్తానమ్మా!" అంది సునంద.

"వదిన్నీ....అన్నపూర్ణనీ అడిగానని చెప్పు!" అంది వరలక్ష్మి ప్రసన్న వదనంతో.

అప్పటికి సునంద ముఖం తేటపడింది. "అలాగేనమ్మా! త్వరగానే వచ్చేస్తాము!"

"స్టేషనుదాకా నేనూ రానామ్మా?" అన్నాడు వెంకట్రావు.

"అక్కర్లేదు మామయ్యా!....రిక్షా వేసుకుంటాం... దాన్లో మా సామాను కూడా ఎక్కించుకొని వెళ్ళిపోతాం...." అంది భవాని సునంద చేయి పట్టుకుంటూ.

వీధిలోదాకా వచ్చి కూతుర్ని, మేనకోడల్ని సాగనంపారా దంపతులు.

"చూడు అమ్మలెంత సంబరపడుతూ వెళ్ళిందో!" అన్నాడు వెంకట్రావు.

"అది సుఖపడటం-సంతోషపడటం నాకిష్టంలేదంటారా?" అంది వరలక్ష్మి ముఖం చిన్నబుచ్చుకుంటూ.

"ఛ! అలా అని నేనెప్పుడేనా అంటానటే? తల్లిగా నీ బాధ నువ్వు చెప్పుకున్నావు......శీనుమీద నాకున్న నమ్మకం నేను చెప్పాను. అంతే: ఏమయినా, వాళ్ళకి రాసిపెట్టి ఉంటే ఎవ్వరూ వాళ్ళ పెళ్ళిని కాదనలేరు!" అన్నాడతను.

4

వాళ్ళ రిక్షా స్టేషను చేరేసరికి శ్రీనివాస్ ఎదురు చూస్తూ నిలబడ్డాడు.

రిక్షాలోంచి దిగిన భవానిని చూసి, "....రావే చెల్లాయ్! బండొస్తోంది...." అని దగ్గరగా వచ్చి చేతిలోని సూటుకేసు అందుకున్నాడు. కదలబోయి అదే రిక్షాలోంచి మరెవరో దిగటం చూసి ఆశ్చర్యపోయాడు.

సునంద ముసిముసిగా నవ్వింది.

భవానివైపు ప్రశ్నార్థకంగా చూశాడతను.

"ఈ అమ్మాయెవరో అత్తారింటికి దారెటు అని అడిగిందన్నయ్యా! ఇటు- అని తీసుకువచ్చాను!" అని కిలకిలా నవ్వింది భవాని.

చెల్లెలి నెత్తిమీద మొట్టి, "....ఈ కాసేపట్లో ఇంత ఘన కార్యం చేసొచ్చావా?" అన్నాడు.

"చూడు నీ మూలంగా!" అంది భవాని సునందవైపు తిరిగి తల పట్టుకొని బాధ నటిస్తూ.

"నిన్ను రమ్మని నేను చెప్పలేదు!" అన్నాడు శ్రీనివాస్ చిరుకోపం ప్రకటిస్తూ.

"నువ్వు రమ్మనేదేమిటి? నా యిష్టం.... నా టిక్కెట్టు నేను పెట్టుకు వస్తున్నాను!" అంది సునంద బింకంగా.

శ్రీనివాస్‌కి నవ్వాగలేదు. "సంతోషించాంలే. బండొస్తోంది ప్లాట్‌ఫారం మీదకి నడవండి...." అంటూ తను బుకింగ్ ఆఫీసు దగ్గరకి పరిగెత్తాడు.

"అమ్మయ్య! నా బరువు తీరింది" అంది భవాని అభినయిస్తూ.

సునంద మురిపెంగా నవ్వింది.

ఇద్దరూ ప్లాట్‌ఫారం మీదికి నడిచారు. శ్రీనివాస్‌వచ్చి వాళ్ళని కలవటం, బండి రావటం దాదాపు ఒకేసారి జరిగింది.

ఎలాగో ఓ కంపార్ట్‌మెంటులోకి జొరబడ్డారు. శ్రీనివాస్

టిప్‌టాప్ డ్రస్సు చూసి కిటికీ దగ్గర కూర్చున్న పల్లెటూరి ఆసామి కొంచెం జరిగి చోటిచ్చాడు.

"ఫర్వాలేదు. మీరు వీలుగా కూర్చోండి." అన్నాడు శ్రీనివాస్.

"పర్లేదు బాబూ! సర్దుకుందాం."

ఆ మాటలు విని, "పోనీ, కూర్చో అన్నయ్యా!" అంది భవాని.

కాదనలేక- తను నిరాకరిస్తే ఆ ఆసామి నొచ్చుకుంటాడని పించి కూర్చున్నాడు శ్రీనివాస్.

వాళ్ళదక్కుండానే, ఎదురెదురు బెంచీల మీద ఆడవాళ్ళు సర్దుకుని, సునందకి, భవానికి చోటిచ్చారు. వాళ్ళ మనస్సుల్లోని ఆనందం ముఖాల మీద చిరునవ్వులు దొర్లించింది.

"ఏవూరెడుతున్నారమ్మా?" అని అడిగింది భవాని ప్రక్కన కూర్చున్న ముత్తయిదువ.

భవాని చెప్పింది "మావూరు గోపాలపురం."

"ఆ యమ్మ నీకేమవుతుంది?"

"వదిన"

"ఓహో! నీ పెనిమిటి అత్తారింటికి తీసుకువెడుతున్నాడమ్మా?" అందావిడ సునందవైపు చూస్తూ.

ఆమె ముఖం ఎర్రనయింది. భవాని కొంటె చూపులకి తట్టు కోలేక తల దించుకుంది.

"మీ అన్నయ్యేం చేస్తున్నాడమ్మాయ్?" అని మళ్ళీ ఆవిడ భవాని నడిగింది.

"మెడిసిన్ చదువుతున్నాడు."

"అంటే?"

"అదే- డాక్టర్ అవుతాడండి!"

"మరికనేం? రెండు చేతులా సంపాదిస్తాడు!" అందావిడ సంబర పడిపోతూ.

శ్రీనివాస్ చెవుల్లో ఈ మాటలే పడ్డట్టున్నాయి. అతను నొసలు

చిట్లించటం చూసింది భవాని. ముసలావిడ అంతటితో వదిలిపెడితే చాలనుకుంది కాని, ఆమె కోరిక తీరలేదు.

"మీ వదినేం చదివింది?" అని మళ్ళీ అడిగిందావిడ.

"బియ్యే చదివింది."

"మరి నువ్వు?"

"బియ్యేస్సీ చదువుతున్నా."

"పెళ్ళెప్పుడు చేసుకుంటావ్?"

ఈ ప్రశ్నలకిక అంతం లేకపోయే సరికి భవానికి చిరాకెత్తిపోయింది. ప్రస్తావన తన మీదికి వచ్చేసరికి ఒళ్ళు మండిపోయింది. 'అయినప్పుడు' అని అందామని నోటి చివరిదాకా వచ్చి అతికష్టం మీద నిగ్రహించుకుంది. "నాకు తెలియదండి.... బాత్ రూమ్‌కి వెళ్ళాలి." అని అక్కడ్నించి లేచిపోయింది.

తల దించుకుని ఆ మాటలన్నీ వింటున్న సునంద, ప్రశ్నల వెల్లువ తన మీదకి దండెత్తి రాకముందే చేతిలోని పత్రిక తెరిచి ముఖానికి కడ్డుపెట్టుకుంది. ఇదంతా క్రీగంట గమనించిన శ్రీనివాస్ తనలో తను నవ్వుకున్నాడు.

# 5

ఆ పూట మహాలక్ష్మికి ఒంట్లో కులాసాగాలేదు... ఈ మధ్యకాలంలో ఆవిడ కలాగే ఉంటోంది. ఒకపూట లేచి తిరిగితే మరో పూట పక్క వేయడమే. అందుకనే, ఆవిడ విషయంలో అన్నపూర్ణ అతి జాగ్రత్తలు తీసుకుంటుంది. ప్రొద్దెక్కితేకాని పక్కమీదనుంచి లేవనివ్వదు. ఇంట్లో బరువైన పనులేవీ చెయ్యనివ్వదు. ఇక వంటింట్లోకి ఆవిడవచ్చి కొన్ని నెలలయిందంటే అతిశయోక్తి కాదు. రాత్రి కూడా మామగారికంటె ముందు ఆవిడకి త్వరగా అన్నంపెట్టి పక్క వేసి పడుకోమంటుంది అన్నపూర్ణ. ఆమె ఇన్ని జాగ్రత్తలు తీసుకోబట్టే ఆ విడ ఆమాత్రం లేచి తిరుగుతోంది.

ఆవేళ ప్రొద్దున్న అరుగుల మీద సంపది యధావిధంగా మొదలయింది.

"ఏవోయ్ బావా! చెల్లెమ్మ ఈ పూట బయటికే వచ్చింది కాదు!" అన్నాడు రామరాజు లోపలి గుమ్మంలోకి తొంగిచూస్తూ.

"అలా అనకపోతే, కాఫీకి వేళయిందని సూటిగా చెప్పకూడదోయ్?" అన్నాడు పరంధామయ్య నవ్వుతూ.

"బ్రహ్మం...." అని కేకపెట్టాడు జగన్నాధం.

"అయ్యా...." వాళ్ళ మాటలు విని పనిలోంచి వచ్చాడు వీరబ్రహ్మం.

"నే తెస్తాలెండి!" అని లోపలికి వెళ్ళబోయాడు.

ఇంతలో కాఫీ గ్లాసులతో అన్నపూర్ణ గుమ్మంలోకి వచ్చింది.

"అరే, నువ్వు తెచ్చావామ్మా!" అన్నాడు రామరాజు నొచ్చుకుంటూ.

"ఈ పూట అత్తగారికి కొంచెం కులాసాగా లేదండి!" అని రెండు గ్లాసులు బ్రహ్మానికందించి వాళ్ళకివ్వమన్నట్టు సంజ్ఞ చేసి తక్కిన గ్లాసులు తీసుకు రావటానికిలోపలికి వెళ్ళింది అన్నపూర్ణ.

చీరచెంగు చెవుల మీదుగా తీసుకొని శాలువా కప్పుకుని గుమ్మంలోకి వచ్చింది మహాలక్ష్మి.

"అరెరే! ఎందుకు లేచి వచ్చావమ్మా?" అన్నాడు నారాయుడు.

"ఎంతసేపని అలా మంచం మీద పడుండనన్నయ్యా?...." అని మళ్ళీ వచ్చిన అన్నపూర్ణని చూసి, "ప్రొద్దుట్నించీ కాలు క్రింద పెట్టనిచ్చిందికాదు. అబబ్బ! ఈ కోడలు పెట్టే బాధ భరించలేకపోతున్నాననుకో!" అంది మహాలక్ష్మి.

అంతా గలగల నవ్వారు.

"పోనీ, పడక్కుర్చీతెచ్చి ఇక్కడ వేయనా అమ్మగారూ?" అన్నాడు బ్రహ్మం.

"అక్కర్లేదు నాయనా! నా ప్రాణానికి నువ్వొకడివి.... అసలు మీసేవ లెక్కువయ్యే నాకీరోగం తగ్గటంలేదు!", అందావిడ చిరాకుపడుతూ.

అన్నపూర్ణ నవ్వి లోపలికి వెళ్ళిపోయింది. బ్రహ్మం తన చోట్లోకి పోయాడు. కాఫీ చప్పరిస్తూ మళ్ళీ ఆటలోకి దిగిపోయారు పెద్దలు.

మహాలక్ష్మి అరుగు మీదకి జరిగి వీధిలోకి తొంగిచూసింది. క్రీగంట ఆమెను చూస్తూనే ఉన్నాడు జగన్నాధం. "ఏవోయ్ బావా! ఈవిడకింత ఓపికెందుకొచ్చిందో తెలుసా!"

"ఎందుకు!" రామరాజు నవ్వుతూ అడిగాడు.

"ఇంకెందుకు? కొడుకు, కూతురు వస్తున్నామని నిన్న కబురెట్టారుగా.... అందుకు." అని జగన్నాధం నవ్వాడు.

"మీ పనికేమన్నా నేనడ్డొచ్చానా? నా గొడవ మీకెందుకు!" అంది మహాలక్ష్మి మూతి ముడుస్తూ.

"అహ! వచ్చినవాళ్ళు వీధిలోనే ఉండిపోరుగదా.... నీకీ తాపత్రయం ఎందుకూ అని?.... రాగానే నేనోకేక వేస్తాను కాని, వెళ్ళు. హాయిగా పడుకో!"

"బాగానేవుంది. మీకు పేకాటుంటే అంతా నిశ్చింతే! వస్తానన్న వేళకి పిల్లలు రాలేదేమని ఎక్కడా ఆ యిదిలేదు!"

ఓ నిమిషం పేకాట మాని అంతా ఆమెవైపు తిరిగారు.

"కంగారుపడకు చెల్లెమ్మా! ఈ క్షణానో, ఆ క్షణానో రానే వస్తారు. బండి లేటయిందేమో!" అన్న రామరాజు మాటల్ని అంది పుచ్చుకొని "....బండి దిగ్గానే సరిపోయిందా? వెంటనే బస్సు దొరకాలి. రావాలి. మరి కాసేపట్లో వస్తార్లేమ్మా!" అన్నాడు నారాయుడు.

మహాలక్ష్మి మనస్సు కొంచెం కుదుటపడింది. గాఢంగా నిట్టూర్చింది.

"ఆ మాటలు మీరిద్దరూ అన్నారు కాబట్టి సరిపోయింది. లేకపోతే, నా మీద గయ్యమని లేచి ఉండేది!" అన్నాడు జగన్నాధం భయం నటిస్తూ.

ఆమె ఏదో అనేలోగా ఆచారిగారు వచ్చారు. "నమస్కారమండీ...." అని పెద్దలని పలకరించి, "ఏమిటమ్మా? కోడలుగారు కబురంపారని ఉన్నపాటున వచ్చాను." అన్నాడు.

"ఏం లేదు బాబూ! మళ్ళీ ఈ పూట ఏమిటో ఆయాసంగా ఉంది. అంతే." అంది మహాలక్ష్మి.

"ఏది చెయ్యిలా ఇవ్వండి " అని ఓ నిమిషం నాడి పరీక్షచేసి,

"....మరేమీలేదు. రాత్రి సరిగా నిద్రపట్టి వుండదు. ఏదో ఆలోచిస్తూ పడుకొని ఉంటారు!" అన్నాడు ఆచారిగారు.

"ఈపూట పట్నంనుంచి అబ్బాయి, అమ్మాయి వస్తున్నారు... అందుకని ఆ ఆలోచనలు!" అన్నాడు జగన్నాధం.

"అలా అయితే ఫర్వాలేదు లెండి....వాళ్ళు రాగానే అంతా సర్దుకుంటుంది. అందాకా ఈ మందు వేసుకోండి!" అని నవ్వి తన సంచిలోని మాత్ర యిచ్చాడు ఆచారిగారు.

అన్నపూర్ణ నీళ్ళు తెచ్చిచ్చింది. మహాలక్ష్మి మాత్ర వేసుకుంది.

"ఏమయినా, ఆచారిగారి మాత్రంటే మహాలక్ష్మమ్మకి మహా గురి!" అన్నాడు పరంధామయ్య.

"అందుకనే, ఊళ్ళో సమితివారి హాస్పటలు ఉన్నా వెళ్ళను ససేమిరా అంటుంది" అన్నాడు రామరాజు.

"ఆచారిగారిక్కడికి రావటం మాత్రం ఎన్నాళ్ళులే?...వస్తున్నాడుగా డాక్టరు కొడుకు! ఇకనుంచీ తల్లికన్నీ తనే చూస్కుంటాడు" అన్నాడు నారాయుడు.

ఆచారిగారివైపు అంతా చూసారు. ఆయన ముఖం కొంచెం కళ తప్పినమాట నిజమేకాని, అంతలోనే ఆయన నవ్వు తెచ్చుకున్నాడు. "అంతకన్నా మనం మాత్రం కోరుకునేదేముంటుందండీ?"

జగన్నాధం వెంటనే అన్నాడు - "అలోపతీ వైద్యం ఎంత పెరిగినా, కుర్రాళ్ళు ఎన్ని డాక్టరు డిగ్రీలు తెచ్చుకున్నా ....ఆచారిగారి అనుభవం, ఆయుర్వేదం మంచి లక్షణం వృధాపోతాయా? ఆ అవసరం ఉన్నవాళ్ళు సవాలక్షమంది ఉంటారు."

"అవునవును...." అన్నాడు రామరాజు.

"కొడుకు డాక్టరవుతున్నాడని తెల్సినా....ఉన్నమాట నిష్పక్షపాతంగా చెప్పాడు జగన్నాధంబావ!" అన్నాడు నారాయుడు మెచ్చుకోలుగా.

ఇంతలో ఇంటిముందు రిక్షా ఆగింది. రిక్షాలోంచి దిగిన మనిషిని చూసి అంతా ముఖాలు చూసుకున్నారు.

"నువ్వటే!" అంది మహాలక్ష్మి.

"అవునమ్మా! ఏమిటంతా అలా చూస్తున్నారు?...."

ఇంతలో గుమ్మంలోకి వచ్చిన అన్నపూర్ణ, "ఏం లేదు సుశీ! ఈవేళ శీను, భవాని వస్తున్నారని పద్మనాభం అన్నయ్య వచ్చి చెప్పారు. రిక్షాచూసి వాళ్ళేమో అనుకున్నారత్తగారు....దాలోపలికి!" అంది.

సుశీల రిక్షాకి డబ్బులివ్వబోతే, "నేనిస్తాలేమ్మా!...." అని రిక్షావాడిని పిల్చి తనలాల్చీ జేబులోంచి చిల్లరతీసి ఇచ్చాడు జగన్నాధం.

"మీ వూళ్ళో అంత కులాసాగా ఉన్నారా సుశీలమ్మా?" అని పలకరించాడు రామరాజు.

"ఆఁ! అంతా కులాసాయే మామయ్యా!" అంది సుశీల.... అన్నపూర్ణ చేతుల్లోవి లక్ష్మినెత్తుకుంటూ.

"మీ ఆయన్ని కూడా వెంటబెట్టుకురాకపోయావే పిల్లా!" అన్నాడు నారాయుడు నవ్వుతూ.

"ఆయనకు రేపు హైదరాబాదు ప్రయాణం వుంది మామయ్యా! ఏదో ఇంటర్వ్యూకి వెళ్ళాలట!" అంది సుశీల.

కోడల్ని కూతుర్ని మార్చి మార్చి చూసి, "పదవే లోపలికి!" అని తనూ లేచింది మహాలక్ష్మి.

వాళ్ళు లోపలికి వెళ్ళిపోయాక, "....ప్చ్! ఈ రోజుల్లో ఇంటర్వ్యూలు దొరుకుతున్నాయేకాని....ఉద్యోగాలు మాత్రం దొరకటంలేదు!" అన్నాడు పరంధామయ్య.

"మా బావ ఏమన్నా అనుకుంటే అనుకోవచ్చుగాని....సుశీలకి శంకరానికి అంత త్వరగా పెళ్ళిచేయటం చాలా తప్పయిందయ్యా!" అన్నాడు రామరాజు.

"అతను మాత్రం ఏం చేస్తాడు? పెళ్ళి చేస్తారా లేదా అని ప్రాణాలు తీసింది వర్ధనమ్మ. మేనరికమేకదా-ఎప్పుడయితేనేం అని పెళ్ళి చేసాడు. కోడలొస్తే పనికి అసరాగా ఉంటుందని ఆవిడనుకుందే కాని....కొడుక్కిముందు ఉద్యోగం రావాలని చూసుకోలేదు. ఆ తప్పు ఆవిడది!" అన్నాడు నారాయుడు.

జగన్నాధం పేకముక్కలు చూస్తూ కూర్చున్నాడే కాని ఏమీ మాట్లాడలేదు.

"అహ! నేననేది....ఉద్యోగమో—ఉద్యోగమో అని ఆ అబ్బాయి ఇలా ఊరూరూ తిరక్కపోతే చక్కగా ఆ వున్న పొలం లోనే ఏ కూరలో పండించవచ్చుగా? లేకపోతే, కోళ్ళఫారం పెట్టొచ్చు. చదువుకున్న వాళ్ళందరికీ ఉద్యోగాలు రావాలంటే మాటలా? తెలివితేటలతో ఎంతమంది ఎన్ని బిజినెస్‌లు చేయటం లేదు?....వాళ్ళమ్మకీ నాన్నకీ తోచకపోతే....నువ్వయినా మార్గం చెప్పవచ్చుగా బావ? ఎంతయినా పిల్లనిచ్చిన మామగారివి!" అన్నాడు రామరాజు.

జగన్నాధం పేలవంగా నవ్వాడు. "పిల్లనిచ్చిన మామగార్ని కనుకనే నా మాటలు అసలు రుచించవు....ఏమిటో చాదస్తం కొద్దీ నువ్వంటున్నావు. నేను పడుతున్నా కాని....మనం హైరానపడి లాభంలేదోయ్! పిల్లల్ని కన్నాంకాని-వాళ్ళ కర్మల్ని కనలేదు మనం!"

అప్పుడే సైకిలు తీసుకుని బయటకు వచ్చాడు సూర్యం.

"సూర్యం కుటుంబం బరువంతా ఎలా మోస్తున్నాడో? పగలంతా బ్యాంకులో పని చేస్తున్నాడా-సాయంత్రం ఇంకెక్కడో శ్రమ పడుతున్నాడు. అదిగో, కొడుకంటే అలా ఉండాలి!" అన్నాడు రామరాజు.

ఎందుకో సూర్యం ముఖం ఎర్రనయింది. చటుక్కున తల త్రిప్పుకొని సైకిలెక్కాడు. మరుక్షణంలో సైకిలు కనుమరుగై పోయింది.

"అందుకనే ఇంత తీరుబడిగా పేకాడుతున్నాడు జగన్నాధం బావ," అన్నాడు నారాయుడు నవ్వుతూ.

"ఏమిటోయ్? ఈ పూట ఆటమాని కబుర్లెక్కువ మొదలెట్టారు!" అన్నాడు జగన్నాధం.

మళ్ళీ ఆటలో పడిపోయారు వాళ్ళు.

# 6

తలుపులమీద చప్పుడయి వెళ్ళి తీసింది రుక్మిణి. గుమ్మంలో నిల బడి వుంది అన్నపూర్ణ. ఆమె ముఖం ఎర్రగా వుంది.

"అదేమిటి అన్నపూర్ణా? అలాగే నిలబడిపోయావ్? రా లోప లికి!" అంది రుక్మిణి. లోపలికి తొంగిచూస్తూ. "అన్నయ్యగారు వెంకటాపురం వెళ్ళిపోయారా?" అని అడిగింది అన్నపూర్ణ.

"ఆఁ!" అని అన్నపూర్ణ లోపలికి రాగానే తలుపులు దగ్గరగా వేసింది రుక్మిణి.

అన్నపూర్ణ తప్పుచేసిన దానిలా నిలబడిపోయింది.

రుక్మిణి దగ్గరగావచ్చి ఆమె భుజంమీద చెయ్యివేసింది. "ఏమిటి అన్నపూర్ణా? ఎందుకలా ఉన్నావు?"

అన్నపూర్ణ వెంటనే ఏమీ మాట్లాడలేకపోయింది. ఆమె చుబుకంక్రింద చేయిపెట్టి ఎత్తింది రుక్మిణి. నీళ్ళు నిండిన ఆమె కళ్ళు వర్షించటానికి సిద్ధంగా ఉన్నాయి.

"పూర్ణా! ఎందుకమ్మా ఈ కన్నీళ్ళు? నిన్నీస్థితిలో చూసి నేను భరించగలనా?" అంటూ తన చీరచెంగుతో ఆమె కళ్ళొత్తింది రుక్మిణి. "....చెప్పు ఏం కావాలి? నాదగ్గర నీకింకా సందేహమేనా? చెప్పమ్మా!" అంటూ బుజ్జగింపుగా ఆమె భుజం వూపింది.

"సుశీల వచ్చింది...." అతికష్టంమీద ఎలాగో గొంతు పెగుల్చుకుంది అన్నపూర్ణ.

రుక్మిణి ఆమెనోక్షణం పరీక్షగా చూసింది. గాఢంగా నిట్టూర్చి. "అర్థమయింది. వాళ్ళాయన దేనికో ఇంటర్వ్యూకి వెడు తున్నాడని... డబ్బు కావాలంటుంది. అంతేగా?"

అన్నపూర్ణ తల వూపింది.

"ఎంతకావాలట?"

"వంద....వాని....ఈవేళ శీను, భవాని వస్తున్నారు. నీకూ తెలుసుకదా! వాళ్ళకి వెళ్ళేముందు ఎంతో కొంత ఇవ్వాలి!"

"సూర్యానికి చెప్పకపోయావా?"

రుక్మిణి చూపులకి తట్టుకోలేక తల దించుకుంది అన్నపూర్ణ. "చెప్పాను."

"ఏమన్నాడు?"

ఆమె పలక లేదు.

"మాట్లాడడు. అంతేగా? .... అవునమ్మా! ఈ బరువంతా మోసేదానివి నువ్వున్నావు. ఇంకెవరికీ అక్కర్లేదు!....సరే. మొత్తం ఎంతకావాలో చెప్పు?"

"సుశీల ఈ సాయంత్రమే వెళ్ళి పోతుందట."

"సరే. ఆ వందా నా దగ్గరున్నాయి. ఇస్తాను. మరి తక్కినది?"

"రెండు పందలయినా శీను కివ్వాలి. పాపం! వాళ్ళక్కడ ఇబ్బంది పడుతున్నారో ఏమో?"

"అలాగే. మీ అన్నయ్య గారితో ఈ రాత్రే చెపుతాను. రేపు తెప్పించి పెట్టమని చెపుతాను."

అన్నపూర్ణ సజల నేత్రాలతో అంది-"ఏ ఋణం నేనెప్పటికీ తీర్చుకో లేను వదినా!"

రుక్మిణికి కూడా కళ్ళు చెమర్చాయి. "నువ్వీబాధలు పడుతుంటే చూస్తూ ఏమీ చేయలేక పోతున్నాను. నాలాంటి చేతకానిది మరెవ్వత్తి ఉండదు" అందామె నిస్పృహగా.

అన్నపూర్ణ చటుక్కున చీర చెంగుకి కళ్ళొత్తుకుంది." లేదు వదినా! ఈ పాటికి మీరుకాక మరెవరయినా అయితే నా మర్యాద. ఇంటి పరువు మంట కల్సిపోయుండేవి. మంచి రోజుల్లో పెంచుకున్న స్నేహం మర్చిపోకుండా అన్నయ్య గారటు - నువ్విటు నన్ను కాపాడుతున్నారు. సొంత చెల్లెల్ని కాకపోయినా ఏ అన్నయ్యా చెల్లెల్కి చేయలేనంత ఉపకారం చేస్తున్నారాయన. ఇంతకంటే నాక్కావల్సిందే ముంది?"

రుక్మిణి గాఢంగా నిట్టూర్చింది. అల్మారా తెరిచి వంద నోటు తెచ్చి యిచ్చింది.

"వస్తాను వదినా!"

"ఒక కప్పు కాఫీ తాగి వెళ్ళవూ?"

"ఇంట్లో వాళ్ళంతా ఎదురు చూస్తూంటారు. ఈ మాటొచ్చినపుడు తప్పకుండా తాగుతాను. మరేమనుకోకు."

"అలాగే....నీకు తీరిక అయ్యేసరికి మరెన్నాళ్ళు పడుతుందో చూడాలి!" అని జాలిగా నవ్వింది రుక్మిణి.

ఆమె చేతులు పట్టుకొని కళ్ళ కద్దుకుంది అన్నపూర్ణ. "వెళ్ళొస్తా!" అని కదిలింది. వీధి గుమ్మందాకా వచ్చి ఆమెను సాగనంపింది రుక్మిణి. వడి వడిగా వెళ్ళిపోతున్న అన్నపూర్ణ కనిపించకుండా ఆమె చూపులకడ్డం వచ్చింది కన్నీటి తెర—"ఆమె కష్టాలు గట్టెక్కించు దేవుడా!" అని కనపడని దేవుడిని కళ్ళు మూసుకొని అర్థించింది రుక్మిణి.

# 7

ఊరికి దగ్గరయింది గుర్రబ్బండి.

"మీ అత్తారిల్లు దగ్గర పడింది వదినా!" అని మేలమాడింది ముందు కూర్చున్న భవాని.

శ్రీనివాస్ కవ్వింపు చూపులు గ్రుచ్చుకొని సునంద బుగ్గలు ఎరుపెక్కాయి.

"ఊఁ! ఏమిటిలా మీద పడిపోతున్నావ్?" అన్నాడతను కొంటెగా నవ్వుతూ.

"మీద పడుతున్నది నువ్వా-నేనా? ఇది మరీ బావుంది!" అంది సునంద చిరుకోపంతో.

భవాని ముసి ముసిగా నవ్వింది.

"అబ్బాయి గారూ! కొంచెం పైకి జరగండి....బండి ముందు తేలి పోతోంది." అన్నాడు బండివాడు.

"అవును మరి! ముందు కూర్చున్న వాళ్ళు ఏడు మల్లె పువ్వులెత్తు పిల్లలు. మరి తేలిపోదూ?" అని - మరి కొంచెం పైకి జరిగాడు శ్రీనివాస్. పని కట్టుకొని సునంద భుజాన్ని తన భుజాలతో గుద్దాడు....బండివాడు నవ్వుకున్నాడు.

"మీ యిద్దరి మధ్య శాండ్‌విచ్ అయిపోతున్నాను." అంది సునంద ముడుచుక్కూర్చుంటూ.

"మా అన్నయ్యకి శాండ్‌విచ్ అంటే మహాయిష్టం" అని మరో చెణుకు విసిరింది భవాని.

"అబ్బబ్బ! ఈ రోడ్డంతా గతుకులేమిటో!" అంది సునంద విసుగ్గా.

"ఇకనుంచి అత్తింటికి - పుట్టింటికి మధ్య తిరగాల్సింది ఈ రోడ్డు మీదే వదినా!"

"ఊఁ!"

"నువ్వు ఊఁ- అన్నా తప్పదు, ఆఁ- అన్నా తప్పదు. అత్త వారి వూరు, ఈ రోడ్డు మీద ప్రయాణం, ఈ అర్ధ మొగుడు - ఆ ఫుల్ మొగుడు...." అని పక పకా నవ్వింది భవాని.

సునంద బుగ్గలు కెంపులయ్యాయి. భవాని చేతిమీద గిల్లింది.

"అమ్మో! గండు చీమ!"

"జాగ్రత్త!" అని బెదిరించింది సునంద.

మరి కాసేపు చూపులతో మాట్లాడుకున్నారు, పోట్లాడు కున్నారు, కవ్వించు కున్నారు, నవ్వించుకున్నారు.

"అబ్బ! నోరెండిపోయింది!'' అంది సునంద ఉస్సురు మంటూ.

"ఇది పట్నం కాదు పిల్లా! టక్కున వెళ్ళి టాప్ విప్పి తెచ్చు కోటానికి!'' అన్నాడు శ్రీనివాస్.

తన ముఖమెంత వాడిపోయిందో తెలియని భవాని వదిన ముఖం వాడి వత్తయి పోవటం చూసింది. ఆమె పెదవులతో నాలుక తడుపు కోవటం చూసింది-తన గొంతు ఎండిపోయిన విషయమే మరచి.

"మరీ దాహంగా ఉందా వదినా?" అని జాలిగా అడిగింది.

గుటకలు మింగుతూ తల వూపింది సునంద. ఆమె నుదుట చిరు చెమటలు పట్టాయి.

వాళ్ళిద్దర్నీ చూసేసరికి శ్రీనివాస్‌కి జాలేసింది. "ఈ పూట మరీ ఎండ ఎక్కువగా ఉంది. మరో పది నిమిషాలు ఓర్చుకుంటే

ఎలాగో ఊళ్ళో పడిపోతాం." ఆ మాట అన్నాడే కాని....వాళ్ళనా స్థితిలో చూశాక అలా ఉండమనటం అతనికి భావ్యమనిపించలేదు.

బండిలోంచి తల బయిటకి పెట్టి పొలాల వైపు దృష్టి సారించాడు. ఏదో గుర్తుకు వచ్చినట్లు తల పంకించాడు. "బండి కొంచెం ఆపవోయ్!" అన్నాడు.

బండి వాడు ఆపాడు.

శ్రీనివాస్ క్రిందకి దిగాడు - "అదిగో ఆ కనిపిస్తున్నదే నారాయుడు మామయ్యగారి చెరుకు తోట. అక్కడ బోరింగ్ పంపు వుంది. నేను వెళ్ళి నీళ్ళు తెస్తాను...." అని కదలబోయాడు.

"అక్కడ్నించి తేవటానికేదయినా ఉంటుందో లేదో? పోనీ మేమే వస్తాం బావా!" అంది సునంద.

"నువ్వు రాగలవా అని?" అని మందహాసం చేసాడు తను.

"ఇక్కడ కూర్చుని ఈ బాధ పడటం కన్నా నీళ్ళు దొరుకుతాయన్న ఆశతో నడపటమే సుఖం."

"సరే, దిగండి."

ఇద్దరూ దిగారు.

"మీరు వెళ్ళిరండి బాబూ! నేనిక్కడే బండాపుతాను." అన్నాడు బండి వాడు.

గబ గబా పొలాల కడ్డంగా అడుగులు వేసాడు శ్రీనివాస్.

"నెమ్మదిగా నడు అన్నయ్యా! ఈ పట్నం మహారాణి నడవలేక పోతోంది." అని వెనుక నుంచి కేక పెట్టింది భవాని.

శ్రీనివాస్ ఆగి నడుంమీద చేతులు పెట్టుకొని నిలబడ్డాడు. ఆడ పిల్లలిద్దరూ వచ్చారు.

"నడవగలవా? ఎత్తుకొనేదా?" అన్నాడు.

సునంద సిగ్గుగా నవ్వింది. "ఫర్వాలేదు....పద...."

ఆమె పెదవులు పొడారి పోయాయి. మాటకూడా తడబడింది.

"అదిగో అదే వదినా! మామయ్యగారి తోట. రెండడుగులు వేస్తే చేరిపోతాం." అని ఆమె చేయి పట్టుకొని నడిచింది భవాని.

మరో ఐదునిమిషాల్లో నారాయుడుగారి తోట చేరారు. బెల్లం

తయారీ చేసే వాళ్ళంతా పని ఆపి మధ్యాహ్నం భోజనాలు చేస్తు న్నారు.

అంత దూరం నుంచే శ్రీనివాస్‌ని గుర్తుపట్టాడు నారాయుడు కొడుకు రామ్మూర్తి. ఎదురు వచ్చి "ఏమోయ్ డాక్టరు బావా! అమ్మా యిల్ని తీసుకొని మిట్టమధ్యాహ్నంవేళ ఇలా పొలాలకడ్డం పడ్డావేంటి? వెన్నెలను కున్నావా ఏం?'' అని పరిహాస మాడాడు.

''లేదు బావా! ఇప్పుడే పట్నం నుంచి వస్తున్నాం. మంచి నీళ్ళయితేను....రోడ్డుమీద బండాపి యిటొచ్చాం!''

''ఒరేయ్! మంచినీళ్ళు పట్రంద్రా!'' అని పనివాడిని పురమా యించాడు రామ్మూర్తి.

ఇంతలో అమ్మాయి లిద్దరూ అక్కడికి చేరారు.

''ఏం మరదలు పిల్లా! బాగా చదువుకుంటున్నావా?'' అని పలకరించాడు రామ్మూర్తి.

భవాని తలూపింది.

పనివాడు మంచినీళ్ళు తెచ్చి శ్రీనివాస్ కందించాడు. అతను భవాని కందించాడు. భవాని సునంద కందించింది.

"నువ్వు తాగు....'' అంది సునంద.

"ఫర్వాలేదు....ముందు నువ్వుతాగు." అంది భవాని.

రామ్మూర్తి గలగలా నవ్వాడు. "వాదులాట మాని ముందె వరో ఒకరు త్రాగండి!....పాపం, ఎలా ముఖాలు వాడిపోయాయో! ఇంతెండలో బయలుదేరారేంటి బావా?...."

"బండి లేటయింది....బస్సు వెంటనే దొరకలేదు...." అన్నాడు శ్రీనివాస్.

"భోజనాలు చేసారా?"

"వెంకటాపురంలో టిఫిన్ తిన్నాంలే!"

"అరెరే!....పోనీ, కొంచెం చెరుకు పానకం తాగ్గూడదూ?"

"మళ్ళీ దాహం అని వీళ్ళంటే ఇక సాయింత్రం దాకా నా పని పొలాల మీద మంచినీళ్ళకి తిరగనే సరిపోతుంది" అని శ్రీనివాస్ నవ్వాడు.

అప్పటికి ఆడపిల్లలు దాహం తీర్చుకోవటం అయింది. శ్రీనివాస్ కూడా తాగాడు,

"మరిక వెడదాం అన్నయ్యా!" అంది భవాని.

"మంచి నీళ్ళు తాగిన వెంటనే బయలుదేరకూడదు....ఓక్షణం ఆగండి" అన్నాడు రామ్మూర్తి.

అంతలో నారాయుడు వచ్చాడు. "ఒర్నీ! మీరిక్కడికి వచ్చార్రా?....పాపం! మీ అమ్మ ప్రొద్దుట్నించీ ఇంకా రాలేదేమిటా అని తెగ ఇదయిపోతోంది....ఏమిటీ, బండి లేటయిందా?"

"అవును మామయ్యా! దారిలో నిన్ను చూసి పోదామని ఇటొచ్చా" అని నవ్వాడు శ్రీనివాస్.

నారాయుడు గలగల నవ్వాడు-"మామయ్య మీద ప్రేమెంతుందో చూస్తాగా?....చూస్తున్నావా అమ్మాయ్! వీడినెలా అదుపులో పెడతావో మరి!"

సునంద సిగ్గుగా నవ్వింది.

"నాల్గు రోజులుంటారా?" అని అడిగాడు నారాయుడు.

"ఉంటాం. మరిక వస్తాం మామయ్యా!" అంది భవాని.

"త్వరగా వెళ్ళండి మీ అమ్మ ఎదురు చూస్తోంది. రేపో సారిటు రండి....కడుపు నిండా చెరుకు రసం తాగి వెడుదురుగాని"

భవాని తల వూపింది. తిరుగు ముఖం పట్టారు.

"అదేమిటన్నయ్యా? మన కోసం అమ్మ ఎదురు చూస్తోందంటాడు మామయ్య! మనం వస్తున్నామని అమ్మా వాళ్ళ కెలా తెల్సు?" అని ఆశ్చర్యంగా అడిగింది భవాని.

శ్రీనివాస్ చిన్నగా నవ్వాడు. "మొన్న పద్మనాభం బావ ఏదో పని మీద పట్నం వచ్చాడులే. నేనే వస్తున్నామని కబురు పెట్టాను"

భవాని మూతి ముడిచింది. "మంచి పనే! ముందు ప్లాను వేసుకొనే తర్వాత నాతో చెప్పావన్న మాట! మన ప్రయాణం సంగతి తనకి ముందు చెప్పాను కానని వదిన నన్ను కొట్టినంత పని చేసింది తెలుసా?"

"మీ అన్నయ్య ఎప్పుడూ ఇంతే" అంది సునంద అతన్ని చురుక్కున చూస్తూ.

"నేను చెప్పకపోతేనేం? మీరే గెలిచారుగా!" అన్నాడు శ్రీనివాస్ నవ్వుతూ.

ఆడపిల్లలిద్దరూ ముఖా ముఖాలు చూసుకుని నవ్వుకున్నారు. మరో ఐదు నిమిషాల్లో గుఱ్ఱబ్బండిని చేరారు.

"మంచినీళ్ళు తాగారా బాబూ?" అని అడిగాడు బండివాడు.

"ఆఁ! కడుపు నిండా తాగి వచ్చాం." అంది భవాని.

"పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్టున్నాయి." అంది సునంద.

శ్రీనివాస్‌కి తాను చేసిన తప్పు తెల్సి వచ్చింది "....అరే, నీకు తేలేదు...."

అతని మాటల కడ్డు వచ్చాడు బండివాడు - "ఫర్వాలేదు బాబూ!....మాకీ ఎండా, దాహం....అంతా అలవాటే. బండెక్కండి."

ముగ్గురూ బండి ఎక్కారు. బండి కదిలింది.

"....మనం చదువుకున్నాం కాని మన చదువు మనకి స్వార్థం మాత్రం నేర్పింది." అన్నాడు శ్రీనివాస్ నెమ్మదిగా.

ఆ మాటలు విననట్టు బండివాడు గుఱ్ఱాన్ని అదలించటంలోనే మునిగిపోయున్నాడు.

ఎఱ్ఱబడిన శ్రీనివాస్ ముఖం చూసారు అమ్మాయిలు. అంత కన్నా ఎక్కువగా జేవురించాయి వాళ్ళ ముఖాలు. ఎవ్వర్కీ ఏమీ మాట్లాడాలని పించలేదు....

మరో పది నిమిషాల్లో గోపాలపురం ఊళ్ళో ప్రవేశించింది బండి. . మిట్ట మధ్యాహ్నం మూలాన చాలా మంది ఇళ్ళలో విశ్రాంతి తీసుకుంటున్నట్టున్నారు. అప్పటికీ. అరుగుల మీద కూర్చున్న వాళ్ళు బండి వైపు తొంగి చూస్తూనే ఉన్నారు.

ఒకరు ఊళ్ళోంచి పొరుగూరికి వెడితే క్షణాల మీద తెలుస్తుంది. ఎవరయినా ఊరికి తిరిగి వస్తే నిమిషాల మీద తెలుస్తుంది. ఎవరెందుకు వెడుతున్నారో-ఎందుకు ఎవరు వస్తున్నారో, అందర్కీ తెలుస్తుంది....అంటే. ఒక్కరికి తెలిస్తే చాలు-ఆ నోటా ఆ నోటా ఆ కబురు వూరంతటికీ పాకుతుంది. మంచయినా చెడయినా ఇట్టే ఊరంతటినీ చుట్టబెడుతుంది. ఇది పల్లెటూరు లక్షణం.

గుఱ్ఱబ్బండి జగన్నాధం గారింటి ముందు ఆగేసరికి అరుగుల

మీద సందడి లేదు. అంతా మధ్యాహ్నం భోజనాలయ్యాక విశ్రాంతి తీసుకుంటున్నారు.

రామరాజుగారి భార్య మంగమ్మ వాళ్ళ వీధి అరుగుమీద కూర్చుని ఎవరితోనో మాట్లాడుతున్నది బండిని చూసి వచ్చింది. ముందు దిగిన శ్రీనివాస్‌ని చూసి, "ఏమిటల్లుడా కులాసాయేనా?" అని పలకరించింది. గబగబా జగన్నాథం గారింటి మెట్లెక్కి "వదినా! వదినా!....పిల్లరొచ్చారు...." అని కేక పెట్టింది.

అప్పటికే పక్కిళ్ళ వాళ్ళంతా అరుగుల మీదకి చేరి చోద్యం చూడసాగారు.

అందరికన్నా ముందు హడావిడిగా బయటకు వచ్చింది మహాలక్ష్మి. బండి దిగిన వాళ్ళని చూసేసరికి ఆవిడ అపరిమితానందంతో ఊగిసలాడి పోయింది. "వచ్చారా! ఇంతాలశ్యమయిందే మర్రా?"

"రైలూ-బస్సూ రెండూ లేటే అయ్యాయమ్మా!" అని పరుగు పరుగున వచ్చి తల్లిని కౌగలించుకుంది భవాని.

"అత్తారింటికి వచ్చేసినట్టేనా అమ్మాయ్?" అని మంగమ్మ సునందని అడిగింది నవ్వుతూ.

సునంద తలదించుకొని బిడియంగా క్రింద మెట్టు మీద నిల బడి పోయింది.

"చిన్న కోడల్ని గుమ్మంలోనే నిలబెట్టావేంటి వదినా?" అని మేలమాడింది మంగమ్మ.

"రామ్మా!...." అని చేతులు చాచింది మహాలక్ష్మి. కూతుర్ని విడిచి దగ్గరకి వచ్చిన మేనకోడల్ని అక్కున చేర్చుకుంది.

అప్పుడే మంచి నీళ్ళ గ్లాసులతో వచ్చిన అన్నపూర్ణ, "అంతా కులాసాగా ఉన్నారామ్మా?" అని సునందని పలకరించింది.

సునంద తల వూపింది.

వదినగారు తన చేతి కదించిన గ్లాసు బండివాడిని పిల్చి ఇచ్చాడు శ్రీనివాస్. సుశీల తెచ్చిన చెంబుడు నీళ్ళూ బండివాడు త్రాగాక కాని, శ్రీనివాస్ మనస్సు శాంతించలేదు. "గుర్రానికి నీళ్ళు కావాలా?" అని అడిగాడు.

"అక్కర్లేదు బాబూ! చెరువుకు తీసుకుపోయి పట్టిస్తాను

లెండి"- అని సామానుదింపి డబ్బు తీసుకొని వెళ్ళిపోయాడు బండి వాడు.

ఇంతలో కునుకు తీస్తున్న జగన్నాథం లేచి వచ్చాడు.

"ప్రొద్దున్నుంచీ వాళ్ళు రాలేదని గొడవ చేసావ్! ఇప్పుడు లోపలికి రానివ్వవా ఏమిటి?"

"ఇదమ్మా మీ మామయ్య వరస! ఈయన రిటయిరయ్యాక నన్ను మహా కాల్చుకు తినేస్తున్నారు!" అని మేనకోడలితో రిపోర్టు చేసింది మహాలక్ష్మి. అంతా నవ్వుకుంటూ లోపలికి నడిచారు.

"మళ్ళీ వస్తాలే వదినా!" అని చెప్పి మంగమ్మ వెళ్ళి పోయింది.

"నువ్వెప్పుడొచ్చావే అక్కా?" అని అడిగింది భవాని.

"ప్రొద్దున్న.... మీరొస్తారని నాకు తెలియదు. ఏదో చూద్దా మనిపించి...." అని నవిగింది సుశీల.

భవాని లక్ష్మి నెత్తుకొని ముద్దులాడింది. "జగ్గూ ఏడీ?" అని అడిగింది.

"ఇందాకనే స్కూలునుంచి వచ్చాడు. అన్నం తిని ఎక్కడికో ఆటలికి పోయాడు." అంది సుశీల.

"త్వరగా స్నానాలు చెయ్యండి కీనూ! భోజనాలు చేద్దురు గానీ...." అంది అన్నపూర్ణ.

"అవును. అన్నం, నీళ్ళూ....అన్నీ చల్లారిపోయాయి. తెల్ల వారు ఝాము నుంచి ఎదురు చూస్తున్నాము" అంది మహాలక్ష్మి.

ఆ తర్వాత ఇల్లంతా కావల్సినంత కబుర్ల సందడి.

# 8

మధ్యాహ్నం మూడు గంటలు కావస్తోంది.

ఇద్దరూ కూడబలుక్కున్నట్టు రామరాజు, పరంధామయ్య ఒక్క సారే వచ్చారు. అప్పటికే వీరబ్రహ్మం వచ్చి తన పనిలో పడి పోయాడు.

"ఏమోయ్ బావా! పిల్లలొచ్చారటగా?" అని గుమ్మంలో నిలబడి కేకవేసాడు రామరాజు.

"ఆఁ! వచ్చారు. లోపలికి రా అన్నయ్యా!" అంది మహాలక్ష్మి.

రామరాజు, పరంధామయ్య లోపలికి వచ్చారు. శ్రీనివాస్ కుర్చీలు తెచ్చి వేశాడు.

"నిలబడి పోయారేంటమ్మా! మీరూ కూర్చోండి!" అన్నాడు రామరాజు.

భవాని, సుశీల చాపమీద కూర్చున్నారు. భవాని సునందని కూర్చోమని సంజ్ఞ చేసింది. "ఇప్పుడే వస్తా!" అని సునంద అన్నపూర్ణ దగ్గరకి వంటింట్లోకి వెళ్ళిపోయింది- సిగ్గువల్ల కాబోలు. మహాలక్ష్మి మంచం మీద కూర్చుంది. వాలు కుర్చీలో వెనక్కి వాలాడు జగన్నాధం.

"ఏం డాక్టరల్లుడా! ఏమిటి పట్నం విశేషాలు?" అని నవ్వుతూ అడిగాడు రామరాజు.

"అంతా మామూలే మామయ్యా! మీ అందరి ఆశీర్వాదంతో కోర్సు చివరికి వచ్చాను. అదే విశేషం!" అంటూ నవ్వి స్టూలు తెచ్చి వేసుకొని తనూ కూర్చున్నాడు శ్రీనివాస్.

"మాసావుటయ్యా పరంధామయ్యా! నేడో రేపో ప్రాక్టీసు పెట్టుకుని ఈ చేతా ఆ చేతా సంపాదించుకుంటాడా? అయినా ఆ వినయంచూడు! పట్నం వెళ్ళాడన్న పేరేగాని .... మనిషి మాత్రం మారలేదు. జగన్నాధం బావ నిజంగా అదృష్టవంతుడు!" అన్నాడు రామరాజు.

"వాడ్ని పొగిడితే పొగుడుకాని.... నన్ను మాత్రం పొగడకు బావా! ఉబ్బిపోయానంటే ఈ కుర్చీ పట్టదు. పాతగుడ్డ, చిరిగి పోతుంది కూడాను!" అన్నాడు జగన్నాధం.

అంతా పగలబడి నవ్వుకున్నారు.

"ఏమయినా ఉన్నమాట అంటున్నాను- రేపోద్దున్న కొడుకు సంపాదిస్తుంటే .... నీకిక మాతో పేకాడే తీరికెక్కడుంటుంది?

ఇక నీ పని నోట్లు లెక్కపెట్టుకోవడమే." అన్నాడు రామరాజు, పరిహాసంగా.

"అది జరిగే మాటెలా వున్నా నువ్వు చెప్తున్న కథ మాత్రం విన సొంపుగా ఉంది" అన్నాడు జగన్నాధం.

"ఇంతకీ ప్రాక్టీసు ఎక్కడ పెడదామనుకుంటున్నావు శీనూ?" అని అడిగాడు పరంధామయ్య.

తండ్రి వైపోసారి చూశాడు శ్రీనివాస్. తండ్రి కూడా తన జవాబు కోసమే ఎదురు చూస్తూండటం గుర్తించి, "ప్రాక్టీసు పెట్టట మంటే మాటలు కాదుగా!'' అన్నాడు తలదించుకుంటూ.

వెంటనే ఎవ్వరికీ ఏమనటానికీ తోచలేదు.

"మాటలు కాకపోయినా ఏదో ఒక మార్గం చూసుకోవాలిగా! మొదలంటూ పెడితే.... ఆ తర్వాత అదే దార్లో పడుతుంది! అప్పో సొప్పో చేసయినా సరే" అన్నాడు పరంధామయ్య.

"అప్పు చేయవల్సిన అవసరం ఏముందయ్యా! పిల్లనిద్దా మనుకుంటున్నాడుగా మేనమామ! .... అదంతా అతనే చూసుకుంటాడు." అన్నాడు రామరాజు- జగన్నాధంవైపు ఏమంటావన్నట్టు చూసి.

జగన్నాధం మాట్లాడలేదు. కొడుకువైపు చూశాడు, శ్రీనివాస్ ముఖం ఎర్రగా కందిపోయింది. అతను దించిన తల ఎత్తలేదు.

"ఏం శీనూ! మాట్లాడవేంటి? ఎలాగా మీ మామయ్య కట్నం యిస్తాడు. అది పెళ్ళి ఖర్చులకని దూబరా చేయకుండా దీనికి వాడుకుంటే బావుంటుందని నా అభిప్రాయం.... నేనేం తప్పుగా అన్లేదు కదా?" అన్నాడు రామరాజు.

"అబ్బే! అదేంలేదు...." అని తలయెత్తి ఏదో అనబోయాడు శ్రీనివాస్

"లోకంలో రివాజయిన మాటే నేనూ చెప్పాను. అంతెందుకు? కొద్దోగొప్పో మీ అన్నయ్య పుచ్చుకోలేదా? భార్గవి మొగుడికి మీ నాన్న ఇవ్వలేదా? .... ఎటొచ్చీ సుశీలకి మేనరికం కదాని అట్టే ఇవ్వలేదుకాని.... కట్నాలు పుచ్చుకోవటం, ఇవ్వటం మన యిళ్ళల్లో కొత్తేంకాదు."

"నాకు కట్నం పుచ్చుకోవటమంటే ఇష్టంలేదు మామయ్యా!" అన్నాడతను ధృఢ స్వరంతో.

కొన్ని క్షణాలపాటు నిట్టూర్పులు వినిపించేంతగా ఇల్లంతా నిశ్శబ్దమైపోయింది.

"ఓహో! ఈ మధ్య కట్నాలు పుచ్చుకోకూడదంటూ నాయకులు నినాదాలు చేయటం.... ఆడపిల్లలు, మగపిల్లలు అంతా ప్రతిజ్ఞలు చేయడం వింటున్నాము. బహుశా అలాంటిదేమన్నా చూశావేమిటల్లుడూ?" అని పెద్దగా నవ్వాడు రామరాజు.

శ్రీనివాస్ ముఖం జేపురించింది - "నువ్వేమనుకున్నా నాకు పర్వాలేదు. నా నిర్ణయం నేను చెప్పాను."

అతని గంభీర కంఠం వాతావరణాన్ని యిబ్బందిలో పెట్టింది.

"కోప్పడకల్లుడూ! ఏదో సరదాకన్నాను! కట్నం పుచ్చుకో కుండా ఉండటం మంచిదే. కాని, నేననేది నువ్వడుగుతున్నావని కాదు. మీ మామయ్య యిస్తాడంటున్నాను. కష్టపడికాదు, ఉన్నంతలో కొంత. నీకూ దాని అవసరం ఉన్నప్పుడు పుచ్చుకోవటంలో తప్పే ముంది?" అన్నాడు రామరాజు.

"అవసరం వచ్చిందని మనస్సు మార్చుకోవటం నాకిష్టం లేదు. ప్రాక్టీసు పెట్టుకోలేకపోతే, ఏ హాస్పటల్లోనో చేరి ఉద్యోగం చేస్తాను."

వెంటనే ఎవ్వరూ ఏమీ మాట్లాడలేకపోయారు.

"మేనమామ యింట్లోఉండి చదువుకోటానికే అభిమాన పడినవాడు.... కట్నం పుచ్చుకుంటాడా రామరాజూ?" అన్నాడు పరంధామయ్య.

"ఏం బావా! నువ్వు పెదవి కదిపావేకాదు?" అన్నాడు రామరాజు.

జగన్నాధం పల్చగా నవ్వాడు. "నేను రిటయిరైపోయాను."

"బలేవాడివే! అడక్క అడక్క నిన్నే అడగాలా నేను?.... ఏం చెల్లెమ్మా! అంతా వింటున్నావా?" అన్నాడు రామరాజు మహాలక్ష్మివైపు చూస్తూ.

ఆవిడ అందర్నీ కలయజూసి గాఢంగా నిట్టూర్చి, పల్చగా

నవ్వింది. "వినటమే నా వంతు. చెప్పటానికి వాళ్ళేమన్నా చిన్నవాళ్ళా? వాళ్ళకాలోచించటం తెల్సు. అడుగు వేయటమూ తెలుసనే అనుకుంటున్నాను. ఏమయినా, మీ బావగారన్నట్టు.... ఆయనే కాదన్నయ్యా నేనూ రిటయిరై పోయాను. పెద్ద కోడలు ఉంది, పెద్ద కొడుకున్నాడు, ఇంటి బాధ్యదంతా వాళ్ళదే. ఇదీ వాళ్ళే చూస్కుంటూరు. వాళ్ళేం చేస్తే మనమది అవుననటమే."

ఇంతలో వంటింట్లో రుక్మిణి గొంతు వినిపించింది.

"అక్కడే ఉండిపోయారేంటి ఇంటికోడళ్ళూ! ఇలా రండి." అని గొంతెత్తిపిలిచాడు రామరాజు.

అన్నపూర్ణ, రుక్మిణి బయటకు వచ్చారు.

రుక్మిణినిచూపి "పెద్దాడపడుచు కూడా వచ్చిందన్నమాట!" అని నవ్వాడు రామరాజు.

రుక్మిణికి ఆ యింటి ఆడబడుచుకిచ్చినంత గౌరవంఇస్తారు.... ఇంట్లోవాళ్ళు, చుట్టుప్రక్కల వాళ్ళు.

"రామ్మా రుక్మిణీ!" అని దగ్గరికి పిలిచింది మహాలక్ష్మి.

రుక్మిణి వచ్చి మహాలక్ష్మి ప్రక్కనే మంచంమీద కూర్చుంది.

"మీ ఒంట్లో కులాసాగా ఉంటోందా పిన్నీ?"

"ఆఁ! నాకేం విశేషంలా ఉన్నానమ్మా! ఏమిటో రావటమే లేదు నువ్వీటు?"

"ఏదో పనితో తీరక...." అని నవ్వింది రుక్మిణి.

"అన్నపూర్ణమ్మా! మీ చెల్లాయిని వంటింట్లో దాచేసావేమిటి?" అన్నాడు రామరాజు.

వంటింటి గుమ్మంలో నిలబడిన అన్నపూర్ణ "సిగ్గు పడుతోంది బాబాయిగారూ!" అంది.

అప్పుడే దొడ్డివైపునుంచి వచ్చింది మంగమ్మ. "మీరంతా బైఠాయించారిక్కడ! ఎలా వస్తుంది!" అంటూ వంటింటిలోకి చూసి నవ్వింది.

"అదేమిటి! చదువుకున్న పిల్లకూడాను...." అన్నాడు రామరాజు.

"బాగానే వుంది మీరనేది. చదువుకున్న వాళ్ళంతా సిగ్గుపడ రనా? ఆడపిల్లకి సిగ్గేసింగారం."

"నువ్వెక్కడో పల్లెటూళ్ళో కూర్చుని చిలకపలుకలు పలుకు. పట్నం వెళ్ళినప్పుడు కళ్ళెట్టుకుచూడు. ఈనాటి ఆడ పిల్లలెలా ఉంటారో తెలుస్తుంది." అని గలగలా నవ్వాడు రామరాజు.

"ఏమో, ఎవరి సంగతో మనకెందుకు? మన పిల్ల బుద్ధిమంతు రాలు. ఎక్కడెలా ఉండాలో తెల్సు!" అని భర్తని సవాల్ చేసింది మంగమ్మ.

"ఇక్కడున్నవాళ్ళు పరాయివాళ్ళు కాదని చెప్పి బయటకు తీసుకురా మరి."

మంగమ్మ కదలక ముందే అన్నపూర్ణ చెప్పిన మాట విని సునంద బయటకు వచ్చింది.

"కూర్చోవమ్మా!" అన్నాడు రామరాజు.

సునంద సుశీల ప్రక్కనే ఒదిగి కూర్చుంది.

భవానికి సంజ్ఞచేసి వంటింట్లోకి పిలిచింది అన్నపూర్ణ. ఆమె అందించిన కాఫీలు తెచ్చి అందరికీ ఇచ్చింది భవాని.

"ఏం వదినా! క్రొత్త కోడలిచేత ఓ పాట పాడించు" అంది మంగమ్మ కూడా చాపమీద కూర్చుంటూ.

"ఓసి నీ యిల్లు బంగారంగానూ....అప్పుడే కోడలు అత్తా రింటికి వచ్చేసినట్టు మాట్లాతున్నావేమిటి?" అంది మహాలక్ష్మి.

"ఇప్పుడు వచ్చిందా లేదా-ఆ మాట చెప్పు? ఆ మాటకొస్తే సునంద పుట్టటంతోనే నీ కోడలిగా పుట్టింది. ఆ సంగతి తెలియం దెవరికి? మరి అట్టే బతిమాలించుకోక ఓ పాట పాడమని చెప్పు."

మహాలక్ష్మి సునందవైపు చూసింది. ఆమె తలదించుకొని కూర్చుంది. కెంపురంగు రంగరించుకున్న ఆమె ముఖం, సిగ్గు చిందించిన స్వేదంతో తళుక్కున మెరుస్తోంది.

మహాలక్ష్మి అన్నపూర్ణ వైపు చూసింది. అన్నపూర్ణ వెళ్ళి సునంద వెనగ్గా కూర్చుని చెవిలో చెప్పింది.

కొన్ని క్షణాలపాటు ఇంట్లో నిశ్శబ్దం తాండవమాడింది.

సునంద కంఠం విప్పింది. బిడియంతో వణికిన కంఠం

క్రొత్త శ్రుతులు చేసుకుంది. ఆమె గుండెల్లో నిండిన మాధుర్యం కాబోలు పాటకి తీపి దనాన్నిచ్చింది, ఆ పాటకి గుండె కుదుళ్ళవరకు పరవశింపజేసే శక్తి ఉన్నట్టుంది.

మరుక్షణంలో ఆమె మధురగానంలో లీనమై అంతా ఇల్లు, ఒళ్ళు మరచిపోయారు. అంతవరకూ బిడియంతో తలదించుకున్న శ్రీనివాస్ కూడా తలఎత్తి ఆమెవైపే కనురెప్ప వేయకుండా చూస్తుండిపోయాడు.

"ఎంత చక్కగా పాడావమ్మా! ఇకనుంచి నీచేత చక్కగా పాటలు పాడించుకుంటుంది మీ అత్తయ్య! మా మాలక్ష్మమ్మ వదిన్ని చూస్తే నాకు మహా అసూయగా ఉంది సుమా!" అంది మంగమ్మ నిండుగా నవ్వుతూ.

సునంద ఓరగా తలెత్తిచూసింది. శ్రీనివాస్ కొంటె చూపులు గిలిగింతలు పెట్టాయి. చటుక్కున పైకిలేచి లోపలి గదిలోకి పరుగున వెళ్ళిపోయిందామె.

"ఏం బావా! ఈ పూటకి మన సభ చాలిద్దాం." అని లేచాడు రామరాజు.

జగన్నాథం నవ్వి కుర్చీలోంచి లేచాడు.

# 9

"ఇక నేను వెడతానమ్మా!" అంది సుశీల.

"పోనీ, ఈ పూటకుండి పొద్దున్నే వెళ్ళ కూడదటే?" అంది మహాలక్ష్మి.

"లేదమ్మా! ప్రొద్దున్నే మీ అల్లుడికి హైద్రాబాద్ ప్రయాణం. అందుకని...."

"బావకి దేనికే ఇంటర్వ్యూ ట్రవస్త?" అని అడిగింది భవాని.

"ఏమోనే, నాకదేం తెలియదు...." అని నసిగింది సుశీల.

"ఇదిగో అత్తయ్యా!" అని వందనోటు అందించింది అన్నపూర్ణ.

మహాలక్ష్మి అది తీసుకొని సుశీలకిచ్చింది. "జాగ్రత్త!...."

"డబ్బు జాగ్రత్తే కాదమ్మా! బావని ఇంటర్వ్యూ కూడా జాగ్రత్తగా చేయమని చెప్పమను!" అంది భవాని.

ఎవ్వరూ మాట్లాడ లేదు. మహాలక్ష్మి గాఢంగా నిట్టూర్చింది.

అన్నపూర్ణ ఏదో సంచినిండా పెట్టి సుశీలకిచ్చింది.

"రిక్షా వచ్చిందమ్మా!" అన్నాడు వీరబ్రహ్మం.

"తిరిగి పట్నం వెళ్ళేముందు మా యింటికోసారి వచ్చి వెళ్ళు వదినా!" అంది సుశీల సునందతో.

సునంద తల వూపింది.

"పోనీ నేను వచ్చి దిగబెట్టనా చెల్లాయ్?" అన్నాడు శ్రీనివాస్.

"అక్కర్లేదన్నయ్యా! వెంకటాపురం ఎంతదూరమని?.... వెళ్ళొస్తానమ్మా!" అని తల్లితో చెప్పి, వదినగారికి సంజ్ఞ చేసి బయలు దేరింది సుశీల.

వీధి అరుగుమీద తండ్రితో చెపితే, "జాగ్రత్త!" అని హెచ్చరించాడాయన.

వాళ్ళంతా చూస్తుండగానే సుశీల ఎక్కిన రిక్షా కనుమరుగై పోయింది.



## 10

ముని చీకటి పడింది.

వీరబ్రహ్మం బిచాణా కట్టివేసి యింటికి వెళ్ళిపోయాడు. జగన్నాథం సాయంత్రం షికారుకు వెళ్ళాడు. వీధి అరుగులు ఖాళీ అయ్యాయి.

సునంద, భవాని అరుగుమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఈ చీకటిలో ఈ యిల్లు, వీధి....గమ్మత్తుగా ఉన్నాయి" అంది సునంద గుండె నిండుగా గాలి పీల్చుకుంటూ.

"పట్నంలో హడావిడికి, నాయిస్‌కి విసుగెత్తి పోయుంటావు. అందుకని నీకలా అనిపిస్తోంది" అంది భవాని.

ఇంతలో "భవానీ!" అంటూ ఎవరో మెట్లమీద పిలిచారు.

"ఎవరూ?" అంటూ వీధి గడప మీదున్న హరికెన్ లాంతరు యెత్తి చూపింది భవాని. "ఓహో పార్వతా? రావే, అక్కడే నిలబడి పోయావేమిటి?....ఇదిగో మా చిన్న వదిన."

పార్వతి మెల్లెక్కి వచ్చి సునందని ఆపాదమస్తకం పరీక్షించి చూపింది. "బావుంది! మీ పట్నం వదిన ముద్దొచ్చేలావుంది."

భవాని వైపు చిత్రంగా చూపింది సునంద.

భవాని నవ్వింది. "ఇదెప్పుడూ అంతే! ఉన్నమాట టక్కున ముఖాన అనేస్తుంది!....మేమిద్దరం ఎనిమిదో తరగతిదాకా చదువుకున్నాం."

"నువ్వొచ్చావని తెల్సినా....చీకటి పడేదాకా రాలేకయానే." అంది పార్వతి.

భవాని జాలిగా చూసింది. సునంద కిదేమిటో అర్థం కాలేదు.

"ఒక్కసారొస్తావా? అలా వెళ్ళి కబుర్లు చెప్పుకుందాం." అంది పార్వతి.

"అబ్బ! పట్నం వెళ్ళాక ఆ అలవాటు పోయిందే! అలా వెళ్ళాలంటే ఏమిటో సిగ్గుగా ఉంటుంది" అంది భవాని.

"చీకటే కదా! ఫర్వాలేదు." అంది పార్వతి.

"మరి నువ్వో వదినా?" అంది భవాని.

సునంద తల అడ్డంగా త్రిప్పింది." బాబోయ్! నేను రాలేను. నాకంత చీకటంటే భయం."

"అయితే, నేవెళ్ళి చెంబు తీసుకొస్తానుండు." అని హడావిడిగా వెళ్ళిపోయింది పార్వతి.

"కబుర్లు చెప్పుకుందామంటూ చెంబు పట్టుకొస్తానంటుందేమిటి ఆ అమ్మాయి?" అంది సునంద.

"రెండు పనులూ కల్సొస్తాయని!" అని పక పకా నవ్వింది భవాని.

సునందకీ నవ్వొచ్చింది. "బాగానే ఉంది....అన్నట్టు, చీకటి పడే దాకా రాలేక పోయానంటూ ఎంతో యిదిగా ముఖం పెట్టిందా అమ్మాయి?....ఏమిటది?"

అంతలోనే భవాని ముఖంలో కళ తప్పింది. "ఏం చెప్పను వదినా? దానికి పదేళ్ళప్పుడే పెళ్ళి చేసేశారు. ఆ పిల్లాడి కయినా వయస్సెంత? పన్నెండో, పదమూడో, అంతే. పాపం! పెళ్ళయిన ఏడాది లోగానే కాలుజారి చెరువులో పడి చచ్చిపోయాడు."

"అయ్యో పాపం!"

"అప్పుడు పెళ్ళంటే ఏమిటో తెలియక పోయినా, ఇప్పుడు వైధవ్యం అంటే ఏమిటో తెల్సివస్తోంది దానికి. పగలు వీధిలోకి రాదు. పండగలకీ, పేరంటాలకి, నలుగుర్లోకి రాదు. ఆ జీవితం ఎంత దుర్భరమో ఊహించలేము...."

"మళ్ళీ పెళ్ళి చెయ్యనంటారా పెద్దలు?"

భవాని పేలవంగా నవ్వింది. "పల్లెటూళ్ళల్లో అది అసంభవం. కాలం మారింది కాని....మనుషులు మారలేదు. సాంప్రదాయాలు, అలవాట్లు మారలేదు. ఇప్పట్లో మారతాయన్న ఆశాలేదు....."

సునంద కేమనాలో తోచలేదు. గాఢంగా నిట్టూర్చింది.

# 11

లక్ష్మిని గుండెల మీద పడుకోపెట్టుకొని జోకొడుతూ వాలు కుర్చీలో పడుకున్నాడు శ్రీనివాస్. పిల్ల ఎప్పుడో నిద్రపోయింది.

వీధి అరుగుమీద కూర్చుని జగన్నాధం, మహాలక్ష్మి, భవాని ఏవో కబుర్లాడుకుంటున్నారు.

వాకిట్లో దీపందగ్గర కూర్చుని చదువుకుంటున్న జగదీష్‌కి పాఠంలో ప్రశ్నలు వేస్తోంది సునంద.

శ్రీనివాస్ ఒళ్లోంచి పిల్లనితీసి ఎత్తుకొని, "నువ్వు కూడా అన్నానికి లే శీనూ!" అంది అన్నపూర్ణ.

"అన్నయ్య వచ్చాక తింటాను. వాళ్ళకు పెట్టువదినా!" అన్నా డతను.

గదిలో మంచంమీద పడుకోబెట్టి వచ్చింది అన్నపూర్ణ. "ఆయన వచ్చేసరికి బాగా ప్రొద్దుపోతుంది. ఎప్పుడొస్తారో ఏమో? నువ్వాతినెయ్." అని వంటింటివైపు వెళ్ళిపోయిందామె.

మరి కాసేపట్లో అందరికీ వడ్డించానని వచ్చి చెప్పిందామె. అంతా వంటింట్లోకి వచ్చారు.

"నేను నీతో తింటానక్కయ్యా." అంది సునంద.

"ఫర్వాలేదమ్మా! నువ్వు కూర్చో.....నా కిప్పు డప్పుడే అయిందా?"

భవాని సంజ్ఞచేసింది. సునందకి కూర్చోక తప్పలేదు. అన్న పూర్ణ వడ్డిస్తుండగా అవీ ఇవీ కబుర్లు చెప్పుకుంటూ అంతా భోజ నాలు చేశారు.

భవాని పక్కలువేసి మేనల్లుడిని దగ్గర పడుకోపెట్టుకొని ఏవో కబుర్లు మొదలుపెట్టింది.

వంటింట్లో అన్నపూర్ణకి ఆసరాగా ఉండిపోయింది సునంద.

"బావ వచ్చేవరకు నువ్వు తినకుండా ఉండాలా అక్కా?"

సునంద ముఖంలోని అమాయకతకు నవ్వువచ్చింది అన్న పూర్ణకి. ఆమె నవ్వినందుకు సునందకి కోపం వచ్చింది. "బయటకి వెళ్ళినవాడు ఏదోటి తినకుండా ఉంటాడేమిటి?"

"రేపు పెళ్ళయ్యాక....ఇలా నిరీక్షించటం ఎందుకో నీకే తెలుస్తుందిలే!"

సునంద సిగ్గుపడింది.

"నువ్వు పగలు ప్రయాణంచేసి అలసిపోయావు కాని, కొంచెం పెందరాళే పడుకో."

"అలాగే. ఒక్క షరతుమీద. ప్రొద్దున్న నువ్వు లేచినప్పుడే నన్ను లేపాలి."

"అలాగే." అని చెల్లెలి ముఖం చేతుల్లోకి తీసుకొని ప్రేమగా ముద్దుపెట్టుకుంది అన్నపూర్ణ.

# 12

కోడి కూతకి ముందే యధావిధిగా అన్నపూర్ణ లేచింది. నూతిలో చేదవేసింది.

జగన్నాధంకి మెలకువ వచ్చింది. మగతనిద్రలో ఉన్న

సునందకి తెలివివచ్చింది. ఆయన పక్కమీదనుంచి లేవటానికి ముందే సునందలేచి దొడ్లోకి నడిచింది.

"అప్పుడే లేచేసావేం? కాసేపు పడుకోపోయావా?" అంది అన్నపూర్ణ నవ్వుతూ.

"నువ్వు లేపవని నాకుతెల్సు. అందుకని నేనే లేచాను" అంది సునంద చిరుకోపంతో.

"రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదా?"

"ఎలా పడుతుందమ్మా? ఇక్కడ దోమలుంటాయి, ఉక్కగా ఉంటుంది....పట్నంలో ఫేను అలవాటాయె." అప్పుడే దొడ్లోకి వచ్చిన జగన్నాధం నవ్వుతూ అన్నాడు.

సునంద బిడియంగా తల దించుకుంది.

"మనంకూడా కరెంటు పెట్టించుకుందాంలే - సునంద పెళ్ళి నాటికి." అని గలగలా నవ్వాడాయన.

అన్నపూర్ణ నీళ్ళచెంబు ఆయన కందించింది. ముట్టించిన చుట్ట పీల్చుకుంటూ బయటకు వెళ్ళిపోయాడు జగన్నాధం.

ఇక అక్కడ్నించి అన్నపూర్ణ వెనకనే తిరిగింది సునంద. ఆమె ప్రతి పనిలోను వాటా పంచి పుచ్చుకుంది. ఆమె అప్పాలు పితుకుతుంటే, తను దూడను పట్టుకుంది. వెంకమ్మకి అంట్లువేసింది. నీళ్ళకాగు క్రింద మంటపెట్టింది. వీధిలోను, మెట్లమీద ముగ్గులు పెట్టింది. తులసికోట ముందు పేడతో అలికి, రంగవల్లులు పెట్టింది. స్నానం చేసివచ్చి తులసి పూజచేసింది. పిల్లల్నిలేపి — వాళ్ళచేత ముఖాలు కడిగించింది. నీళ్ళుపోసి బట్టలువేసింది.

ఆమె పనులుచూసి వెంకమ్మ ముచ్చటపడింది, ఆ పూట అద నంగా తావల్సిన పాలుపోసిన నూకాలు, "ఆ అక్కకి చెల్లివే!" అని ముచ్చట్లాడివెళ్ళింది. వీధిలో చూసిన నలుగురూ కళ్ళ విందు చేసు కున్నారు. ఇంట్లో అన్నపూర్ణ చేతిలో పనల్లా ఆమె అంది పుచ్చు కుంటుంటే మహాలక్ష్మికి పరమానందమే కలిగింది. ఇక అన్నపూర్ణ సంతోషానికి అంతే లేదు.

పక్కమీంచి లేచివచ్చిన భవాని "నన్ను లేపకపోయావా వదినా!" అంది.

"సుఖంగా నిద్ర పోతున్నావని." అని నవ్వింది అన్నపూర్ణ.

"అన్నయ్యలింకా లేవనట్టుందే."

"ఇద్దరూ లేవలేదు...." అంది సునంద.

"అయితే, ఎవరి భర్తల్ని వాళ్ళే వెళ్ళి లేపండి మరి!"

సునంద చెయ్యెత్తి కొట్టబోతే భవాని తప్పించుకొని గలగలా నవ్వింది.

అప్పుడే అక్కడికి వచ్చిన మహాలక్ష్మి. "ఏమిటే అంత నిద్రా వాడు?.... శీనుని లేపి రావే సునందా!" అంది.

"ఇప్పుడే మంటావ్?" అని పకపక నవ్వుతూ భవాని ముఖం కడుక్కుంటానికి వెళ్ళిపోయింది. సునంద బుగ్గలు కెంపులయ్యాయి. అక్కగారి వైపు చూసింది. అన్నపూర్ణ సంజ్ఞ చేసింది. సిగ్గుతో ముడుచుకు పోయి శ్రీనివాస్ పడుకున్న గదిలో అడుగు పెట్టింది సునంద.

మెలకువ వచ్చినా అలాగే కళ్ళు మూసుకొని బద్ధకంగా పడుకున్నాడు శ్రీనివాస్. ఒంటి మీద చేతి స్పర్శకి చటుక్కున కళ్ళు విప్పి చూశాడు.

సునంద ముగ్ధ మోహన సౌందర్యం ప్రత్యక్షమయింది. క్షణం పాటు రెప్పవేయకుండా చూస్తుండి పోయాడు.

గబుక్కున ఆమె చేయి పట్టుకొని తన గుండెల మీద పెట్టుకొని కళ్లు మూసుకున్నాడు "కలయో - వైష్ణవ మాయయో?" అంటూ.

"కల కాదు. కళ్ళు తెర్వు" అని నవ్వింది సునంద.

"లేదు లేదు మోహినీ! కళ్ళు తెరిస్తే నా తపస్సు వృధా అయి పోతుందేమో? ఈ పుత్తడి బొమ్మ అంతర్ధానమయి పోతుందేమో? నన్నిలాగే ఉండనీ దేవీ! నువ్విలాగే ఉండు."

"భర్తా! నీ భక్తికి మెచ్చితిని లెమ్ము."

శ్రీనివాస్ కళ్ళు తెరిచాడు. ఆమె అందాన్ని కన్నుల విందు చేసుకున్నాడు. "నన్నను గ్రహింప వచ్చితివా దేవీ?" అంటూ దగ్గరగా లాక్కోబోయాడు.

"ఏయ్ బావా! కిటికీ తలుపులు తెరిచున్నాయి. వీధి అరుగు

మీద అంతా ఉన్నారు. కలబు కట్టి పెట్టి ఇకలే...." అని అతన్నుంచి తన చేతిని వెనక్కి లాక్కుంది సునంద.

"దగ్గరకి రావా?" అన్నాడతను చూపుడు వేలితో బెదిరిస్తూ.

"రాను." అందామె తల అడ్డంగా త్రిప్పుతూ.

"నీతో మాట్లాడను పో."

"అత్తయ్య లేపమంది. లేపాను. లేవకపోతే బబ్బో. నాకేం?"

"నీకూ నాకూ కచ్చి." అన్ని చిన్న పిల్లవాడిలా బుంగమూతి పెట్టాడు శ్రీనివాస్.

ఫక్కున నవ్వింది సునంద.

"ఏమిటి వదినోయ్....ఇంటి నిండా నవరత్నాలు కురిపించేస్తున్నావ్?" అంటూ వచ్చింది భవాని.

ఇక శ్రీనివాస్‌కి మంచం మీద నుంచి లేవక తప్పలేదు.

# 13

శ్రీనివాస్ లేచినప్పుడే సూర్యం కూడా లేచాడు. ఇద్దరూ ముఖాలు కడుక్కోటానికి దాదాపు ఒకే సారి నూతి దగ్గరకి వెళ్ళారు. చిరునవ్వులతో పలకరించుకున్నారు.

"రాత్రి నువ్వు వచ్చేసరికి బాగా ప్రొద్దు పోయిందనుకుంటాను!" అన్నాడు శ్రీనివాస్.

తల త్రిప్పుకుంటూ "ఊఁ!" అన్నాడు సూర్యం. "శలవలా?" అన్నాడు అతనే.

"చెల్లాయికి శలవలు. నాకూ మిమ్మల్ని చూడాలనిపించింది."

అంతే! ఆ తర్వాత మళ్ళీ సూర్యం మాట్లాడలేదు. శ్రీనివాస్ కన్నా ముందు ముఖం కడుక్కొని వెళ్ళిపోయాడు. స్నానం చేసాడు. అన్నపూర్ణని అన్నం పెట్టమన్నాడు. శ్రీనివాస్ స్నానం చేసి వచ్చేసరికి బయిటకు వెళ్ళటానికి సిద్ధమయ్యాడు.

"వెళ్ళొస్తారా!" అన్నాడు ముక్తసరిగా.

శ్రీనివాస్‌కి చాలా నిరుత్సాహమయింది. నిలకడగా నిలబడి నాలుగు మాటలయినా మాట్లాడని అన్నయ్య వెళ్లొస్తానంటే ఏమన గలడు?

"అంత ప్రొద్దున్నే వెళ్ళిపోయాడేమిటి వదినా?" అని అడిగాడు.

అన్నపూర్ణ తల త్రిప్పుకుంటూ అంది-"కొట్లో పని ఉందట."

"ఈ మధ్యవాడికి బొత్తిగా తీరటం లేదు రా...." అంది మహాలక్ష్మి.

ఇంతలో అరుగుమీద నుంచి జగన్నాధం కేక పెట్టాడు. మహాలక్ష్మితో పాటు శ్రీనివాస్ కూడా అరుగు మీదకి వచ్చాడు. మెట్ల మీద నిలబడిన మనిషిని చూసేసరికి మహాలక్ష్మి ముఖం జేవురించింది.

"ఓహో! అప్పన్న మహారాజాగారు దయచేసారేమిటి?" అంది వెటకారంగా.

"ఆఁ! దేశాన్నుద్ధరించటం అయిపోయిందట. ఇక మనల్ని ఉద్ధరిద్దామని వచ్చాడు." అన్నాడు జగన్నాధం కోపంతో.

అప్పారావు తలదించుకొని నిలబడ్డాడు.

"ఏమయింది నాన్నా?" అని అడిగాడు శ్రీనివాస్.

"ఏం ఘనకార్యం చేసొచ్చాడో వాడినే అడుగు సీనూ!" అన్నాడు రామరాజు.

"ఏం చేసావు అప్పన్నా!" అని అడిగాడు శ్రీనివాస్.

అప్పారావు ముఖం ఎర్రబడిపోయి ఉంది. "నేను చేసింది తప్పేబాబూ! కానీ...."

"ఇంకా కానీ అంటావేమిట్రా అప్రాచ్యుడా! అన్నెం పున్నెం ఎరుగని అమ్మాయిని లేవదీసుకుపోయింది చాలక, ఇంకా ఏ ముఖం పెట్టుకొని సమర్ధించుకుందామని వచ్చావు? నువ్వు చేసిన పాడు పనికి నీకెక్కడా అన్నం. నీళ్ళూ పుట్టవ్! మాస్టారి దగ్గర చదువుకున్నందుకు ఆయన పేరుకూడా చెడగొట్టావ్." అంది మహాలక్ష్మి కోపంతో వణికిపోతూ.

"అసలేం జరిగింది మామయ్యా?" అని అడిగాడు శ్రీనివాస్.

"నీకు తెల్సిందే కద శీనూ! మిషన్‌పెట్టి బట్టలు కుట్టుకునే వాడుగా...." అని అగాడు రామరాజు.

"అవును. తర్వాత కూనవరంలో పని చేసుకుంటున్నాడని విన్నాను."

"ఉన్న వూరు విడిచి వెళ్ళకురా అని అప్పుడే చెప్పాడు మీ నాన్న. అక్కడేదో పదపొడి చేద్దామని వెళ్ళాడు. వెళ్ళినవాడు చక్కగా వుండవచ్చునా? ఏడాదిపాటు పనీ అదీ బాగానే చేసు కున్నాడు. నమ్మకస్తుడనిపించుకున్నాడు. మరెలా స్నేహం సంపాదిం చాడో మనకి తెలియదు. ఆ వూళ్ళో రంగారావుగారి అమ్మాయితో స్నేహం కలిపాడు. అంతటితో సరిపెట్టకుండా ఉన్నట్టుండి ఓ రోజున ఆ పిల్లని లేవదీసుకుపోయాడు...."

రామరాజు మాటలకి అడ్డువచ్చాడు అప్పారావు - "మేం పెళ్ళి చేసుకుందామనే అన్నవరం వెళ్ళామండీ!...."

"నోర్మూయ్యరా! ఇంకా సిగ్గులేక చెప్పొచ్చావ్. పట్టుపడ్డాక లేవదీసుకు పోయానవాడు లేవదీసుకుపోయానంటాడేమిటి?....పోనీ, ఆ పెళ్ళి చేసుకుని ఏడిసాడా అంటే అదీలేదు. ముందు విశాఖపట్నం వెళ్ళి షికార్లు తిరిగి అన్నవరం చేరారు. అప్పటికి రంగారావు వల వేసి వీళ్ళని పట్టాడు. నాల్గు తన్ని వీడ్ని తగలేసి కూతుర్ని వెనక్కి తెచ్చుకున్నాడు. గప్‌చిప్‌గా వారం తిరక్కుండా ఆ పిల్లకి పెళ్ళి చేసే సాడు....ఇప్పుడు వీడావూరు వెడితే వాళ్ళు కాళ్ళు విరక్కొడతారు. ఇక్కడ వీడ్ని ఎవ్వరూ గుమ్మం తొక్కనివ్వటంలేదు. రెంటికీ చెడ్డ రేవడిలా అయింది బతుకు. మన ఊరి పరువు గంగలో కలిపాడు వెధవ!...." అన్నాడు రామరాజు మండిపడిపోతూ.

అప్పారావు దించిన తల యెత్తలేదు. కాసేపు ఎవ్వరికీ గొంతు పెగల్లేదు.

"ఇందరిచేత ఛీ అనిపించుకోవాల్సి వస్తోందే! ఆ పాడు పని ఎందుకు చేసావురా?" అన్నాడు శ్రీనివాస్ విస్మయంగా.

అప్పారావు తలెత్తాడు. అతని కళ్ళల్లో నీళ్ళు విలిచి ఉన్నాయి. "తప్పు చేయలేదని నేననలేదు బాబూ! కాని, అలా చేయటానికి

కారణం వుంది. కాని, నామాటలెవరూ నమ్మటంలేదు. నేనేంచేయను చెప్పండి?"

"ఏమిట్రా ఆ కారణం?" అన్నాడు రామరాజు వెటకారంగా.

"వాళ్ళేదో పెళ్ళి సంబంధం నిశ్చయించారండి. ఆ అమ్మాయికా పెళ్ళి యిష్టం లేదండి. అందుకే నన్ను ఎక్కడికేనా తీసుకుపొమ్మని చెప్పింది. తన్నెలాగయినా కాపాడమంది....ఆమె బాధ చూడలేక అందుకు తెగించాను. లేచిపోయిందన్న చెడ్డపేరామెకు రాకూడదనే పెళ్ళిచేసుకుందామనుకున్నాను. మీరు నమ్మినా నమ్మకపోయినా ఇది నిజం."

"చూడవోయ్ బావా! నీ శిష్యుడు ఎంత చక్కని కథ చెపుతున్నాడో!"

జగన్నాథం అప్పారావు వైపు అసహ్యంగా చూశాడు. అది భరించలేక పోయాడతను. అంతవరకు బలవంతంగా ఆపుకున్న కన్నీళ్ళు బుగ్గలమీదకు జారి వచ్చాయి—"నాకెవ్వరూ లేకపోయినా మీరున్నారనుకుంటూ వచ్చాను మాష్టారూ! నేను చెప్పింది ఎవ్వరు నమ్మకపోయినా నాకు బాధనిపించలేదు. కాని, మీరు కూడా నన్ను నమ్మనంటున్నారు. మీచేత ఛీ అనిపించుకున్నానంటే....నన్నీ లోకంలో ఇంక ఆదరించేవాళ్ళంటూ ఎవ్వరూ లేరు...."

గుమ్మంలో నిలబడిన అన్నపూర్ణ దృష్టి అప్పారావు మీదనే వుంది.

చొక్కాచేతులకు కళ్ళు వత్తుకున్నాడు అప్పారావు—"నిజం నిలకడమీద తేలుతుందంటారు. కాని, నాలాంటి దరిద్రుడికి ఆ నిజాన్ని నిరూపించుకునే శక్తి ఉండదు. నాలో మంచంటూ ఏదయినా మిగిలుంటే మీరు, అమ్మగారు గుర్తిస్తారు అనుకుంటూ వచ్చాను. నాకీ చివరి ఆశకూడా పోయింది. నేనెవరికోసం బ్రతకాలి?...." అంటూ దుఃఖం పొంగుకు రాగా చేతులతో ముఖం కప్పుకొని బావురుమన్నాడు.

. అంతవరకూ అతన్ని తిట్టిన రామరాజుక్కూడా మనస్సు మెత్త పడింది.

"ఊర్కో అప్పన్నా! ఊర్కో." అంది అన్నపూర్ణ.

అంతా ఆమెవైపు తిరిగారు.

"అప్పన్న చెపుతున్నది నాకు నిజమేననిపిస్తోందత్తయ్యా!"

ఎవరికీ వెంటనే ఏమనటానికీ తోచలేదు. మహాలక్ష్మి సందిగ్ధంలో పడింది.

అప్పారావు చటుక్కున తల ఎత్తాడు. చొక్కాతో గబగబా ముఖం తుడుచుకున్నాడు. అన్నపూర్ణకు చేతులెత్తి నమస్కారం చేశాడు. "చాలమ్మగారూ! చాలు. మీరొక్కరయినా నన్ను నమ్మారు. నాకంతే చాలు. ఇంక నాకేమైపోయినా ఫర్వాలేదు...."

అప్పారావు కళ్ళల్లోకి నీళ్ళు చిమ్మాయి. ఈ మాట విని దుఃఖంతో ఉబికినవి కావు. ఆనందంతో పొంగి వచ్చినవి. అప్పుడతన్ని చూస్తే అందర్కీ చిత్రమే అనిపించింది. "వెళ్ళి వస్తానమ్మగారూ! వెడతాను మాష్టారూ...." అంటూ అందర్కీ దండంపెట్టి ఓ మెట్టు దిగాడు అప్పారావు

"ఎక్కడికి వెడతావు అప్పన్నా?" అని అడిగింది అన్నపూర్ణ.

"ఏమోనమ్మా! ఎక్కడికి వెడతానని చెప్పను? ఎవరి దగ్గరకు వెడతానని చెప్పను? నాకెవరున్నారని...."

"పిచ్చివాడా! ఎవరూ లేరంటావేమిటి? మేమంతా లేమా? ఎక్కడికీ వెళ్ళకు. నువ్విక్కడే వుండు."

"వద్దమ్మగారూ! నావల్ల మాష్టారికి చెడ్డపేరు రావటం నాకిష్టం లేదు. నన్ను వెళ్ళనివ్వండి."

"మీరు చెప్పండి మావయ్యా అప్పన్నకి. మనం మరో అవకాశం ఇద్దాము. ఆ మంచి నిలబెట్టుకోవాల్సిన బాధ్యత వాడిది."

పదేళ్ళ క్రితం వీరబ్రహ్మం గుమ్మంలో నిలబడినప్పుడు.... అన్నపూర్ణ ఇలాంటి మాటలే అంది. ఈ మాటలన్నీ వింటున్న బ్రహ్మంకి అప్పటి సంఘటన గుర్తుకు వచ్చింది. పరమానందంతో అతని మనస్సు పులకరించింది. కళ్ళు ఆర్ద్రిత చెందాయి. "అప్పుడు అమ్మగారు పెట్టిన భిక్షే నన్నీవేళ ఒక మనిషిగా నిలబెట్టింది బాబుగారూ! అప్పన్న అదృష్టాన్ని కూడా పరీక్షించుకోనీయండి" అన్నాడు.

మహాలక్ష్మి ముఖంలో ఇప్పుడు కోపంలేదు. రామరాజు మరి

మాట్లాడలేకపోయాడు. జగన్నాధం ముఖం తేటపడింది. "ఇక్కడే ఉండరా అప్పన్నా!" అన్నాడు.

"బాబుగారూ!" అప్పారావు కళ్ళు ఆనంద బాష్పాలు వర్షిస్తున్నాయి.

# 14

"ఈ ప్రొద్దున్న కూడా నారాయుడు మామయ్య రమ్మని చెప్పి వెళ్ళాడు. వాళ్ళ చెరుకుతోటకి వెడదామా అన్నయ్యా?" అంది భవాని.

సునందవైపు చూసాడు శ్రీనివాస్ - "ఏం పిల్లా చెరుకు పానకం తాగుతావా?"

"పానకం మాటెల్లాఉన్నా ఒక్కసారి అలా పొలాలమీద తిరిగి కమ్మని గాలి పీల్చుకోవాలని ఉంది" అంది సునంద.

ముగ్గురూ బయలుదేరారు. వీధిపొడుగునా ఎవరో ఒకరు పలకరించేవారే. కళ్ళప్పగించి చూసేవారే. ఎలాగయితేనేం - ఊరు దాటి పొలాలమీద పడ్డారు.

"అబ్బ, వాళ్ళ ప్రశ్నలతో ఉక్కిరిబిక్కిరయిపోయాను."అంది సునంద.

"వాళ్ళడిగింది నన్ను. జవాబు చెప్పింది నేను. మధ్యలో నీకేం?" అన్నాడు శ్రీనివాస్.

సునంద చురచురా చూసింది. "అబ్బ! వాళ్ళలా చూస్తారేమిటి, ఏదో జంతువును చూసినట్లు?"

"జంతువు కాదు వదినా-బొమ్మ. నువ్వు దంతం బొమ్మలా ఉన్నావని" అంది భవాని.

"పోదూ!"

"అయితే నేను పోనా?" అని ఆగిపోయింది భవాని.

"ఊఁ!" అని ఆమె చెయ్యి పట్టుకొని లాగింది సునంద. గల గలానవ్వింది భవాని.

"గబగబా నడు. చీకటిపడేలోగా తిరిగి రావాలి మరి. ఇలా పెళ్ళినడక నడిస్తే కాదు" అని మేలమాడాడు శ్రీనివాస్.

"అబ్బ! ఏమిటి తరుముతున్నావు!"

"తరపటం అంటే అలా కాదు ఇలా" అని ఆమె వీపు మీద చిన్నదెబ్బ కొట్టాడతను.

"ఊం! ఏమిటా మోటుసరసం?"

"సరే సరసం మాని సల్లాపాలాడదామా?"

వాళ్ళలా మాట్లాడుకుంటూ నడుస్తుండగా వీరబ్రహ్మం భార్య మాణిక్యం కనిపించి పలకరించింది. ఆమెతో కబుర్లు చెపుతూ ఓ అడుగు ముందు వేసింది భవాని.

నెమ్మదిగా నడుస్తూ కొంచెం వెనకపడ్డారు సునందా శ్రీనివాస్‌లు.

"నినోటడగనా బావా?"

"అడుగుదామనే నెమ్మదిగా అడుగువేస్తున్నావుగా! నాకు తెల్సులే. అడుగు." అని నవ్వాడతను.

"పరిహాసం కాదు. నిజం."

"అడుగు. అడుగులేస్తూ అడుగు."

"కట్నం పుచ్చుకోనని ప్రతిజ్ఞ ఎప్పుడు చేసావ్?"

చటుక్కున ఆగి నొసలు చిట్లించాడు అతను.

"కోప్పడకు. నిన్న నన్నావుగా కట్నం పుచ్చుకోవటం ఇష్టం లేదని." అని నవ్వింది సునంద.

"నా మాటకేం కాని, బై దిబై ఇస్తామని నువ్వు, మీనాన్న ప్రతిజ్ఞలేం చేయలేదు కదా?"

"పోదూ బడాయి."

"బడాయిలేదు, లడాయీలేదు."

"వేళాకోళం కాదు సీరియస్‌గా అడుగుతున్నా. చెప్పు?"

"అడుగు, చెప్తా."

"నీకు కట్నం అక్కర్లేదు. గుడ్. హేట్సాఫ్ టుయూ. చక్కగా మాఫ్రెండ్స్‌తో కూడా గర్వంగా చెప్పుకుంటాను. కాని, మానాన్న నాకు సంతోషంగా ఏదోటి ఇస్తాడు కదా?"

"ఇస్తాడు. నువ్వూ సంతోషంగానే పుచ్చుకుంటావు కదా?"

"యూనాటీ! లిసన్."

"ఎస్. మేడమ్!"

"మరి నాడబ్బు నీడబ్బేకదా? నువ్వెందుకు తీసుకోకూడదు?"

"నీడబ్బు నాడబ్బెలా అవుతుంది? నీది నీదే. నాది నాదే." అన్నాడతను మూతి బిగిస్తూ.

సునంద చిత్రంగా చూసింది. "అదేంమాట? భార్యకీ భర్తకీ విడివిడిగా అంటూ ఉంటాయా?"

"పెళ్ళి చేసుకోందే నువ్వూ నేనూ భార్యాభర్తల మెలా అవుతాం?"

సునంద చురుక్కున చూసింది-"అదే, అయ్యాకనే."

"నిన్ను నేను పెళ్ళి చేసుకుంటానని ఎప్పుడు చెప్పాను?"

సునంద చటుక్కున ఆగిపోయింది. ఆమె ముఖం చూసి పక పక నవ్వాడతను. ఆమె చెయ్యెత్తి కొట్టబోయింది. అతను తప్పించుకున్నాడు. ఆమె తరిమింది. ఆమె కందకుండా అతను పరిగెత్తాడు.

అలా ఒకర్నొకరు కవ్వించుకుంటూ.... కేరింతాలాడుతూ.... నారాయుడిగారి చెరుకు తోటకి చేరుకున్నారు.

"ముందొచ్చేసావేం?" అని అడిగింది సునంద గోముగా.

"మీ పానకంలో పుడకలా నే నెందుకని?" అని కొంటెగా నవ్వింది భవాని.

నారాయుడు చెరకు పానకం తెప్పించాడు. కడుపునిండా త్రాగారు. కబుర్లాడారు. కొంతసేపు కాలక్షేపం చేసారు.

ప్రొద్దు వాలింది. "మరిక వెడతాం మామయ్యా!" అని నారాయుడితో చెప్పి శ్రీనివాస్ లేచాడు. అమ్మాయిలు వెంటనంటి నడిచారు.

ప్రొద్దున్న వెంకటాపురం కెళ్ళి సాయంత్రానికి తిరిగివచ్చే పల్లె పడుచులు దారిలో కలిసారు.

"ఓ శీనుబాబూ! పప్పన్నం ఎప్పుడు పెట్టిస్తావ్?" అని అడిగింది కూరలమ్మే నాంచారమ్మ.

"ఇదిగో ఈపిల్లనడుగు." అని సునందని చూపించి నవ్వాడు శ్రీనివాస్.

"ఇదిగో బుల్లెమ్మా! బేగే పెళ్ళి చేసుకోండి. మీకాపరం పెట్టు కున్నాక మీకు రోజూ నేనే కూర తెచ్చిపెడతా." అంది నాంచారమ్మ.

"పూలు తేలేదని డాక్టరు బాబుని సాధించకు చిట్టెమ్మా! రోజూ బుట్టెడు పూలుతెచ్చి నీఒళ్లో గుమ్మరిస్తా." అంది పూలమ్మే పాపమ్మ.

"నువ్వు చక్కగా పాడతావంట. ఒక్కపాటినిపించు వరాల తల్లీ! నీయింట ఊర్కేనే పాలుపోసిపోతా." అంది పాలమ్మే నూకాలు.

ఆ పల్లె పడుచుల మాటల్లో తొణికిసలాడే మమకారం వాళ్ళ హృదయ నైర్మాల్యానికి అద్దం పట్టింది. సునంద మనస్సు పురి విప్పి నాట్యంచేసింది. అవలీలగా ఆమె తియ్యని కంఠంనుండి గాన మాధుర్యం సొనలై ఒలికింది. మనుషులే కాదు ...పశు పక్ష్యాదులు కూడ వీనుల విందు చేసుకున్నాయి.

# 15

మర్నాడు ప్రొద్దున్న కుడి అరుగుమీద చతుర్ముఖ పారాయణం మొదలవటానికి ముందే అప్పారావు తనకుట్టు మిషను తెచ్చు కొని ఎడమ అరుగుమీద పని ప్రారంభించాడు. వీరబ్రహ్మం తన సామాను కొంచెం మూలకి జరిపి చోటిచ్చాడు.

"మీ అరుగులు పుష్పక విమానాల్లా ఉన్నాయేబావా?" అంటూ వచ్చాడు నారాయుడు.

"మన కున్నంతలో కాస్తచోటు చూపించాము. ఇందులో పెద్దగొప్ప ఏముందని?" అన్నాడు జగన్నాధం.

"అలా అనక ఏమంటావు? అసలు వీకెస్టేటులేకపోయింది కాని....లేకపోతే, ఊరందర్నీ పిల్చి అందులో ఉండమనే వాడివి."

"ఏమయినా, మనల్నీ అరుగుమీంచి కదిలిపొమ్మని అన్న పూర్ణమ్మ అనకుండా ఉంటే అంతే చాలు." అన్నాడు రామరాజు నవ్వుతూ.

"అలాగంటే సత్యాగ్రహం చేద్దాం." అన్నాడు నారాయుడు.

"సత్యాగ్రహం చేసేవాళ్ళు కాఫీలు బాగా త్రాగుతారట మామయ్యా! ఇదిగో తాగండి." అంటూ తెచ్చిన కాఫీలు ఇచ్చింది భవాని.

అంతా నవ్వుకున్నారు.

"అప్పుడే ఎవడికోయ్ అప్పన్నా. క్రొత్తగౌను కుట్టేసావ్?" అని అడిగాడు రామరాజు.

"లచ్చి తల్లి కండి...." అని లోపలికి వెళ్ళి లక్ష్మిని తీసుకు వచ్చి కుట్టిన క్రొత్తగౌను తొడిగాడు అప్పారావు.

"గౌను భాంది." అంది లక్ష్మి మురిసిపోతూ.

భవాని లక్ష్మి నెత్తుకొని లోపలికి తీసుకువెళ్ళింది.

"ఈపూట మంచి దన్నారండి అమ్మగారు....అందుకని పని మొదలెట్టాను." అన్నాడు అప్పారావు.

"బుద్ధి కుదురుగా ఉంటే అప్పన్న పనిమంతుడే." అన్నాడు రామరాజు నవ్వుతూ.

అప్పారావు వినయంగా నవ్వాడు.

అప్పుడే సూర్యం బయటికి వచ్చాడు.

"నమస్కారం బాబూ!" అన్నాడు అప్పారావు.

"ఊ!! అంతా విన్నాను. ఇక నుంచయినా సరిగా ఉండు." అన్నాడు సూర్యం.

వినయంగా తలవూపాడు అప్పారావు.

సూర్యం సైకిలు పోనిచ్చాడు.

"ఇవేళ ఆదవారం అనుకుంటాను." అన్నాడు నారాయుడు జగన్నాధంవైపు చూస్తూ.

జగన్నాధం తలవూపి గాఢంగా నిట్టూర్చాడు. మళ్ళీ పేక ముక్కలమీదకి దృష్టి పోనిచ్చాడు.

"ఏదో ఒక పని చేసుకునే వాడికి ఆదివారమేమిటి నారాయుడూ?" అన్నాడు రామరాజు.

అప్పుడే వీధి గుమ్మంలోకి వచ్చిన శ్రీనివాస్ ఆ మాటలు విన్నాడు. అతనికి చిరాకెత్తుకు వచ్చింది. ఇంటికివచ్చి రెండురోజు లయితే ఇంతవరకు రెండు నిమిషాలు కూడా తనతో మాట్లాడ

లేదన్నయ్యా! ప్రొద్దున్నే వెళ్ళిపోతాడు....రాత్రి ఎప్పుడో ప్రొద్దు పోయివస్తాడు. ఆఖరికి ఆదివారం కదా ఇంట్లో ఉంటాడని మన స్ఫూర్తిగా మాట్లాడుకోవచ్చని అనుకుంటే ఈపూటా వెళ్ళిపోయాడు.

శ్రీనివాస్‌ని, విస్పృహ చుట్టబెట్టింది. కాని, ఎవరిమీద తన-కోపం చూపిస్తాడు.

"అన్నయ్య ఈవేళయినా ఇంట్లో ఉంటాడనుకున్నాను!" అన్నాడు వదినగారి దగ్గరికివెళ్ళి.

అన్నపూర్ణ మాట్లాడలేదు. ఆమె చూపుల్లోని నిర్లిప్తతకి అర్థమేమిటో అతని కంతు పట్టలేదు.

"రాత్రికయినా పెందరాళే వస్తాడా?" అని మళ్ళీ అడిగాడు.

"ఏమో శీనూ! అడిగితే చెప్పలేదు....పోనీ అలా ఊళ్ళోకి వెళ్ళి రాకూడదూ కాసేపు? తోస్తుంది." అంది అన్నపూర్ణ నవ్వుతెచ్చి పెట్టుకుంటూ.

ఇంకే మనగలడు? "సరే!" అని బయిటికి నడిచాడు.

అప్పుడే పోస్టుమేను సుందరయ్యా లాట్రీ టిక్కెట్లు రామ రాజు కందిస్తున్నాడు.

"మన సుందరయ్యా ఉత్తరాలు తెచ్చినా తేకపోయినా, జగన్నాధం బావకి లాట్రీ టిక్కట్లుతేవటం మర్చిపోడు." అన్నాడు నారాయుడు నవ్వుతూ.

"శీనూ! ఈ లాట్రీటిక్కెట్లు చూశావా! ఇది బీహారు లాట్రీ.... ఇది తగిలితే భవానికి ఒక ఆఫీసరుతో పెళ్ళి. ఇది ఢిల్లీ లాట్రీ.... ఇది తగిలితే నీకు డిస్పెన్సరీ కట్టించవచ్చు. ఇది యు. పి. లాట్రీ.... ఇది తగిలితే...." అని ఇంకా ఏదో అనబోతున్నాడు రామరాజు.

"....చాల్లేవోయ్. ఇలాయియ్యి." అని విసురుగా అతని చేతుల్లోంచి లాట్రీ టిక్కెట్లు లాక్కుని తన జేబులో పెట్టుకున్నాడు జగన్నాధం.

ఆయన ముఖం ఎర్రగా కందిపోవటం చూశాడు శ్రీనివాస్.

జగన్నాధం జేబులు తడుముకొని, "ఒక్క క్షణంఆగు...." అని సుందరయ్యతో చెప్పి "అమ్మాయ్, భవానీ!" అని కేకపెట్టాడు.

భవాని వచ్చింది. "ఏమిటి నాన్నా!"

"వదినడిగి ఓ నాల్గు రూపాయలు పట్టుకువచ్చి సుందరయ్యకిమ్మా!" అన్నాడు తలత్రిప్పి చూడకుండానే.

భవాని లోపలికి వెళ్ళి మరునిమిషంలో డబ్బుతో తిరిగి వచ్చింది.

"వెళ్ళొస్తా మాష్టారూ!" అని సుందరయ్య డబ్బు తీసుకొని వెళ్ళిపోయాడు.

అక్కడే నిలబడి ఇదంతా చూశాడు శ్రీనివాస్.

రామరాజు అతనివైపు చూపి కళ్ళెగరేసి అర్థవంతంగా నవ్వాడు.

"అలా ఊళ్ళోకి వెళ్ళొస్తా నాన్నా!".

"త్వరగా వచ్చెయ్." అన్నాడు జగన్నాధం పేకముక్కల్లోంచి తలెత్తకుండానే.

శ్రీనివాస్ మెట్లుదిగి వీధిలోకి నడిచాడు.

## 16 [illegible]

తలుపు మీద చప్పుడయి తీసింది రుక్మిణి. "నువ్వా శీనూ! రా లోపలికి." అని చిరునవ్వుతో ఆహ్వానించింది.

శ్రీనివాస్ లోపలికి వస్తూ అటూ యిటూ చూశాడు. "ఏరీ! బావగారులేరా?"

"లేరు. వెంకటాపురం వెళ్ళారు.... కూర్చో."

"ఓహో! అయితే అన్నయ్యా, ఆయనా కలిసే వెళ్ళారన్న మాట." అన్నాడతను కూర్చుంటూ.

"లేదే! ఆయన ప్రొద్దున్న చీకటితోనే వెళ్ళారు. మధ్యాహ్నానికి రావచ్చు. అయితే సూర్యం కూడా వెళ్ళాడన్నమాట?"

"అలా అనదంకన్నా, అన్నయ్య ఎప్పుడింట్లో ఉన్నాడు- అని అడిగితే బావుంటుంది."

రుక్మిణి మాట్లాడలేదు.

"రెండు రోజుల్నుంచి చూస్తున్నాను - ఒక్క ఐదునిమిషాలు నిలబడి నాతో మాట్లాడతాడేమోనని. నా ఆశ తీరలేదు. పట్నం

నుంచి అసలెందుకు వచ్చానా అనిపిస్తోంది నాకు." అన్నాడతను నిరుత్సాహంగా.

రుక్మిణి ఉలక్కుండా పలక్కుండా కూర్చుంది.

"ఒక్కటడుగుతాను చెపుతావా అక్కయ్యా?"

"అడుగు బాబూ!" ఆమె కంఠం ఎందుకో వణికింది.

"అసలన్నయ్య మీ యింటికి వస్తున్నాడా?"

రుక్మిణి బలవంతంగా నవ్వింది. "బలేవాడివే! నీకా సందేహం ఎందుకు వచ్చింది?"

"ఆవేళ పట్నంలో కనిపించటమేకాని ఈ రెండ్రోజుల్నించి బావగారు మా యింటికి రావటం నేను చూడలేదు. ఆఖరికి ఈ వేళ ప్రొద్దున్న వెళ్ళేటప్పుడు కూడా రాలేదు. నేను చెప్పేదాకా అన్నయ్య కూడా వెంకటాపురమే వెళ్ళాడని నీకు తెలియదు. ఇదంతా చూస్తుంటే.... వాళ్ళిద్దరి మధ్యా ఇంకా ఆ స్నేహం, ప్రేమ ఉన్నాయంటే నాకు నమ్మశక్యం కావటంలేదు."

రుక్మిణి తలత్రిప్పుకుని అంది, "చాల్లే. అనవసరమైన ఆలోచనలు పెట్టుకుని నీ బుర్ర పాడుచేసుకోకు. ఉద్యోగాల్లు చేసుకుంటున్నవాళ్ళు, ఎవరి బాధ్యతలు వాళ్ళకున్నాయి. ఎవరి వీలునిబట్టి వాళ్ళు పనులు చేసుకుంటారు. అంతమాత్రాన ప్రేమాభిమానాలు ఎక్కడికి పోతాయి?"

ఆమెవైపే దీర్ఘంగా చూస్తూండిపోయాడు శ్రీనివాస్.

ఆ మౌనం భరించలేక తలయెత్తి చూసి చిన్నగా నవ్వింది రుక్మిణి. "కబుర్లలోపడి మరిచాను. మంచినీళ్ళు కావాలా?"

"వద్దు."

"ఉండు, కొంచెం కాఫీపెట్టి వస్తాను."

"ఉత్తకాఫీయేనా? అన్నం పెడతావనుకున్నాను." అని నవ్వాడతను.

"ఆంతకన్నానా? అలాగే తిను .... ఎన్నాళ్ళయిందో తిని." అందామె వాత్సల్యంతో.

ఇంతలో "అమ్మగారూ!" అని బయట ఎవరో పిలిచారు. రుక్మిణి వెళ్ళి పదునిమిషంలో వెనక్కి వచ్చింది. అల్మారాలోని

డబ్బు తీసుకువెళ్ళి వచ్చిన మనిషికిచ్చి వీధితలుపు దగ్గరగా వేసి తిరిగి వచ్చింది.

ఆమె చేతుల్లోని రంగురంగుల కాగితాలు చూసి సంగతి గుర్తించాడు శ్రీనివాస్.

ఆమె చిన్నగా నవ్వింది. "లాట్రీ టిక్కెట్లు." అంది.

"మైగాడ్! నీకూ లాట్రీపిచ్చి పట్టిందా?" అన్నాడతను ఆశ్చర్యంతో తల మునకలవుతూ.

"నాక్కాదు శీనూ! మామగారికి.... సుందరయ్య మీ నాన్న గారికివ్వటం చూశావాయేం?"

"ఆఁ! నాల్గు టిక్కెట్లిచ్చాడు. మరి మామయ్యగారక్కడే ఉన్నారు. ఆయనకివ్వక తెచ్చి నీకిచ్చాడేమిటి?"

"డబ్బు లిచ్చేదాన్ని నేనిక్కడున్నానుగా, అందుకని. సుందరయ్య తిన్నగా ఇక్కడికే వచ్చి ఇస్తాడు. మీ నాన్నగారు కొనటం అక్కడంతా బహిరంగంగా చూస్తారు.... మా మామగారు చాటుగా నాచేత కొనిపించుకుంటారు. అంతే తేడా."

"వీళ్ళకీ వయస్సులో లాట్రీ పిచ్చేమిటి?"

రుక్మిణి పేలవంగా నవ్వింది. "అదృష్టం కలిసొస్తే లక్షలు లక్షలు కలిసొస్తాయని ఆశ."

"ఛ! ఇంత లోకానుభవం ఉంది. ఒకరికి చెప్పవల్సిన వాళ్ళు. వీళ్ళకే ఇంత డబ్బాశ ఉంటే...."

"వాళ్ళదేముంది శీనూ! మహాఅయితే నెలకి పదో పదిహేనో వాళ్ళ పెన్షన్ డబ్బు ఖర్చుపెట్టుకుంటున్నా రనుకోవచ్చు. రిటయిరై పోయాక, ఏమీ తోచక ఇలాంటి చిల్లర ఖర్చు చేస్తున్నారని చూసీ చూడనట్టూరుకోవచ్చు. మా శేషు, మీ జగ్గు డబ్బులడిగినట్టే అనుకొని సరిపెట్టుకోవచ్చు. కాని, తమ జీవితమంతా ఏర్పాటు చేసుకోవాల్సిన వాళ్ళు, జీవితంలో ఎంతో ముందుకు వెళ్ళవల్సినవాళ్ళు దురాశతో కూడని పనులు చేస్తుంటే, ఉన్నడబ్బు తగలబెడుతుంటే ఏమనాలి? లేనిపోని బాధలు తెచ్చిపెడుతూంటే ఎలా భరించాలి? వాళ్ళకి మతి పోయిందనుకోవాలా? అజ్ఞానమనుకోవాలా?"

రుక్మిణి ఆవేశం చూసేసరికి శ్రీనివాస్ వెలతెలబోయాడు.

ఏదో నోరు జారినదానిలా కంగారుగా చూసిందామె. అతని చూపుల్ని తప్పించుకోవటానికన్నట్టు అల్మారా దగ్గరికి వెళ్ళింది. లాట్రీ టిక్కెట్లు అక్కడ పెట్టి ఏదో సామాను సర్దుతూ నిలబడిపోయింది.

"ఎవరి గురించక్కయ్యా- నువ్వంటున్నది?" అన్నాడతను విదావంగా.

"ఫలానా వారని కాదు. లోకంలో వింటున్నదీ కంటున్నదీ చెపుతున్నాను."

"ఆమె మాటలు తడబడటం అతడు గుర్తించాడు. "నానుంచి నువ్వేదో దాస్తున్నావు?"

"బలేవాడివే! నీనుంచి దాచటం ఎందుకు?" అని నవ్వేయబోయింది ఆమె.

అతను లేచి ఆమె దగ్గరగా వచ్చాడు. "చూడక్కయ్యా! నేవింకా చిన్నప్పటి శీనుననే అనుకుంటున్నావా బెలిపించి మరిపించటానికి? నువ్వు నోటితో చెప్పలేకపోతున్నది.... నీ కళ్ళు చెపుతున్నాయి. నన్నిలా సందిగ్ధంలో పెట్టక నిజం చెప్పు? ఎవరది? దబ్బాశతో బాధపెడుతున్నా రంటున్నావు- ఎవర్ని బాధపెడుతున్నారు?"

ఆమె తల త్రిప్పుకుంటూ అంది. "ఏంలేదు శీనూ! సందర్భం వచ్చి మాట వరసకన్నాను."

"మనసులో ఏదో బాధ లేనిదే మాట వరసకూడా నువ్వు నోరు జారవు....నువ్వు చెప్పకపోయినా కొంత కళ్ళతో చూసాను. చెవులతో విన్నాను." అని ఓ క్షణం ఆగాడతను.

రుక్మిణి కంగారుగా చూసింది."ఏమిటీ?"

"మొన్న సుశీల వచ్చింది. వందరూపాయలు పట్టుకు వెళ్ళింది...."

"అదే, వాళ్ళాయన ఏదో హైద్రాబాదు ఇంటర్వ్యూకి వెళ్ళాలట...."

అతని ముఖం జేవురించింది. "ఇంటర్వ్యూకి కాదు, రేసులికి."

"ఆ సంగతి నీకు తెలుసా!" అంది రుక్మిణి అప్రయత్నంగా.

ఈమాటాశ్చర్య పోవటం అతని వంతయింది. "అంటే, మీ అందర్కీ తెలుసన్న మాట?"

"అందర్కీ తెలియదు. నాకు, అన్నపూర్ణకి, మీ బావగారికి తెల్సు...."

"మీ బావ లక్షాధి కారేమిటోయ్—రేసుల్లో డబ్బు తెగఖర్చు పెడుతున్నాడు—అని హైద్రాబాద్ వెళ్ళొచ్చిన మా ఫ్రెండు అడిగాడు. వివరాలు చెప్పమన్నాను. శంకరంగారి ఇంటర్వ్యూల ఘన కార్యం స్పష్టంగా చెప్పాడు. ఈ సంగతి ఇక్కడెవరికీ తెలియదను కుంటున్నానింత వరకు."

"మీ బావకి ఎవరో ఇలాగే చెప్పారు. ఉండబట్టలేక నేను మీ వదినతో చెప్పాను.....శంకరంతో పోలిస్తే మీ పెద్దబావ వెయ్యిరెట్లు నయం. పండగలకి పిల్చినా అత్తారింటికి రాడు. భార్గవిని కూడా అస్తమానం పంపించడు. ఉద్యోగం లేకపోయినా శంకరానికి మేనరికమని సుశీల నిచ్చారు. కట్నం పుచ్చుకో లేదన్న పేరేకాని... అంతకి పదింతలు వసూలు చేస్తున్నా డిప్పుడు."

"అంటే, ఇది మొదటి సారి కాదన్న మాటః"

"మొదటి సారాః నయం. పదోసారో పదిహేనోసారో."

"వదిన అమ్మతో ఎందుకు చెప్పలేదుః"

"చెప్పి ప్రయోజన మేముంది బాబూః ఆడపడుచుకి డబ్బివ్వ టానికిష్టం లేక అలా కల్పించి చెప్తోందని మీ అమ్మాగారపార్థం చేసుకుంటారు కూడా. అందుకే ఆ బాధంతా తనే పడుతోంది అన్నపూర్ణ."

"ఇలా ఎంత కాలంః దీనికి అంతంటూ లేదాః"

రుక్మిణి గాఢంగా నిట్టూర్చింది. "దీనికి కాలమొక్కటే జవాబు చెప్పాలి."

"కాలంః చేతకాని వాళ్ళనే మాటది."

"ఒక విధంగా మంచి మనస్సున్న వాళ్ళని లోకంలో అలాగే అంటారేమో శీనూః" అంది రుక్మిణి ఏదో ఆలోచిస్తూ.

మంచి మనసున్నది మనల్ని మనం మంటల్లో దగ్ధం చేసుకో టానిక్కాదక్కయ్యాః తప్పు తోవన వెడుతున్న వాళ్ళని మంచిదారిన పెట్టటానికి, ఒక విధంగా అది మన బాధ్యత కూడా."

"అది నువ్వనుకున్నంత సుళువూ కాదు, సాధ్యమూకాదు."

"ఎందుక్కాదు?" అదే తీవ్రస్వరంతో అడిగాడతను.

ఒక్క క్షణం ఆగి, "మీ నాన్నగారి చేత లాట్రీలు మాన్పించ గలవా?" అని అడిగింది రుక్మిణి నెమ్మదిగా.

శ్రీనివాస్ తెల్లబోయాడు. అతనికి వెంటనే జవాబు దొరకలేదు.

"లాట్రీ అనేది ఒక ఛాన్స్! లక్షమందిలో ఒక్కడిని అదృష్టం వరిస్తుంది. ఒక విధంగా లక్షమంది దగ్గర డబ్బు వసూలు చేసి ఒక్కడికి ముట్టచెపుతున్నారని అర్థం. ఇదంతా మీ నాన్నగారికి, మా మామయ్యగారికి తెలియదంటావా? తెల్సు....అలా ఆశపడటం ఒక బలహీనత అని కూడా వాళ్ళకి తెల్సు. లాట్రీల మీద ఖర్చుపెట్టే డబ్బుపెట్టి ఏ పళ్ళో, టానిక్కో కొనుక్కోమని మనం అనొచ్చు... అది వాళ్ళకి రుచిస్తుందా? ఇకనుంచి కొనటం మానేస్తారా? ఉహూఁ! ఇప్పుడు రిటయిరై పోయారు కనుక....సంపాదన లేదు కనుక మనం డబ్బివ్వటానికి ముఖం చూసుకుంటున్నామని అపార్థం చేసుకుంటారు? అందుకనే నోర్మూసుకొని ఊరుకోవటం తప్పటం లేదు."

"సరే, నాన్నగారి సంగతి వదిలెయ్. అదేం పెద్ద సీరియస్ విషయం కాదు. కాని, శంకరం సంగతి అలాకాదే.....వందలకి వందలు తగలేస్తున్నాడు." అన్నాడతను తన వాదనని సమర్థించుకుంటూ.

"లేదు శీనూ! అతని వాదం కూడా అదే. అదృష్టం కలిసొస్తే రేసుల్లో లక్షలు తగులుతాయన్ని. ఒక్కొక్కరిది ఒక్కో పద్ధతి. వీళ్ళందర్కీ కావల్సింది కష్ట పడకుండా వచ్చే డబ్బు. దానికో చక్కని పేరు అదృష్టం." అని విషాదంగా నవ్వింది రుక్మిణి.

శ్రీనివాస్ ముఖం జేవురించింది. "వాళ్ళకంత డబ్బెక్కువగా ఉంటే అలాగే వాళ్ళ డబ్బు పెట్టి అదృష్టాన్ని పరీక్షించుకోమను. ఇలా మాటి మాటికీ పుట్టింటి వాళ్ళ ప్రాణాలు తీయటం ఎందుకు? అమ్మ అపార్థం చేసుకుంటుందని ఎంత కాలం అన్నయ్యా వదినా ఈ బాధ పడతారు? పగలంతా బ్యాంకులోను సాయంత్రం షాపు

కారు కొట్లోను అన్నయ్య రెక్కలు ముక్కలు చేసుకుంటున్నాడేః ఇలాంటి దారుణాన్ని భరించటానికేనాః ఇదెక్కడి న్యాయంః"

రుక్మిణి పలకలేదు.

"మాట్లాడ వేమక్కయ్యాః"

"నేనేం చెప్పను బాబూః కొన్ని ప్రశ్నలకి జవాబులుండవు.. అంతేః" అందామె విస్పృహగా.

"అదేం మాటక్కయ్యాః వదిన చెప్పలేకపోతే పోనీ. మరి అన్నయ్య చెప్పొచ్చుగాః శంకరం విషయం అన్నయ్యకి తెలియదాః"

"తెల్సు. తెల్సినా ప్రయోజన మేముందిః"

శ్రీనివాస్ విభ్రాంత పోయాడు. "ఇదెక్కడి వేదాతం అక్కయ్యాః తను కష్టపడి సంపాదిస్తున్న డబ్బు ఎవరో అన్యాయంగా లాక్కుపోతుంటే భరించి ఊరుకోవాలాః ఇదేనా మంచి తనమంటేః ఈ మంచి తనానికి అసలర్థముందాః"

"ఆవేశ పడకు శీనూః అలాంటి సందర్భమొస్తే....ఇంత కన్నా ఎక్కువ బాధనే నువ్వు తలకెత్తుకుంటావు." అందామె రెప్ప వేయకుండా చూస్తూ.

అతని ఆవేశం ఇంకా తగ్గలేదు. "లేదు. అలా ఎప్పటికీ చేయను. ఇలాంటి చేతకాని మంచితనం కన్నా....ఎప్పటికోప్పటికి పనికి వచ్చే స్వార్థం నయం."

"మీ అన్నయ్య విషయంలో కూడా అలాగే ఉండగలవా మవ్వః...."

శ్రీనివాస్ ఉలిక్కిపడ్డాడు. ఆమె వైపు సూటిగా చూసాడు.

రుక్మిణి ముఖం తెల్లగా పాలిపోయింది. గబ గబా వంటింటి వైపు వెళ్ళిపోబోయింది. చటుక్కున ఆమెకడ్డం వచ్చాడతను-"ఏమిటక్కయ్యా నువ్వనేదిః"

"ఏం లేదు బాబూః ఏం లేదు...." అందామె తల దించుకుంటూ.

తటాలున ఆమె చేతులు పట్టుకున్నాడు శ్రీనివాస్. "నేను బాధ పడతానని ఏదో దాచిపెడుతున్నావు."

తన చేతులు గబుక్కున లాక్కుని వెనుతిరిగింది రుక్మిణి.

"నేనేం దాచటం లేదు... అన్నం తింటానన్నావు—రా పెడతాను." అని కదల బోయిందామె.

ఎంత దాచుకున్నా ఆమె గొంతులో సుడులు తిరుగుతున్న ఉద్వేగాన్ని అతను గుర్తించాడు. "నేనింత పరాయి వాడినయిపోతా ననుకోలేదు."

గబుక్కున అతని వైపు తిరిగిందామె. "అంత నిష్ఠూరం భరించలేను బాబూ! నువ్వు నాకెప్పుడూ పరాయి వాడివి కాదు. సూర్యాన్నీ, నిన్ను ఎప్పుడూ సొంత తమ్ముళ్ళల్లా చూసుకున్నాను. అందుకనే, నాకీ ఆవేదన." ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అయితే, నీ ఆవేదన నన్ను అర్థం చేసుకోనీ. ఆ నిజ మేమిటో నన్ను తెల్సుకోనీ."

"నన్నెంత చిక్కుల్లో పెట్టావు శీనూ!" అందామె బాధగా తల పట్టుకుంటూ.

శ్రీనివాస్ ముఖం జేవురించింది. "పోనీ, నానుంచి ఎందుకు దాచాలనుకుంటున్నావో అదయినా చెప్పగలవా?"

ఆమె సజల నేత్రాలతో అతని వైపు చూసింది. "ఎవ్వరికీ చెప్పవద్దని అన్నపూర్ణ నా దగ్గర మాట తీసుకుంది."

శ్రీనివాస్ ముఖం తెల్లగా పాలిపోయింది. "అంటే! నాక్కూడానా? మీ అందరికీ నేనింత కాని వాడినయి పోయానా?"

ఆమె చీర చెంగుకి కళ్ళొత్తుకుంది. "కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది బాబూ! ఆమె సమస్య ఒకళ్ళు పరిష్కరించ గలిగేది కాదు.....మనం చేయగలిగిందల్లా ఆమె గౌరవం కాపాడ టమే. నీ మనస్సు కూడా అశాంతి పాలవటం తప్ప నువ్విప్పుడు తెల్సుకొని ప్రయోజనం లేదు."

"ఈ సందిగ్ధావస్థ కన్న ఆ అశాంతి మేలు. చెప్పు! ఏదీ దాచకుండ నాతో చెప్పు!"

"ఎలా చెప్పను శీనూ! ఏమని చెప్పను? నా నోటితోనే నీకీ విషయం చెప్పాల్సి వస్తుందని ఎప్పుడూ అనుకో లేదు" అందామె గాద్గదిక స్వరంతో.

శ్రీనివాస్ నిశ్చలంగా చూశాడు. "చూడక్కయ్యా! వదినా

అన్నయ్యా నాకు తల్లీ తండ్రీ లాంటి వాళ్ళు. వదిన సహకారమే లేకపోతే, నా చదువు ఇంతవరకు సాగేది కాదు. నా జీవితంలో మా అమ్మ కన్నా ఆమెకెక్కువ ఋణపడి ఉన్నాను. ఆమె సుఖాలు పంచుకోవటం మాత్రమేనా నా హక్కు? ఆమె కష్టాలు పంచుకోవటం నా బాధ్యత కాదా?''

''కాదని ఎవరంటారు బాబూ! ఆ సమయం వచ్చినపుడు ఆమె కోరకుండానే నువ్వా బాధ్యత స్వీకరిస్తావు. ఆ నమ్మకం నాకెప్పుడూ ఉంది."

"అయితే, నీకింకా నాతో చెప్పటానికి సందేహమేమిటి?"

"లేదు. చెప్తాను. తప్పకుండా చెపుతాను. నీ చదువు ముందు కానీ....ఆ తర్వాత ...."

"నాకా సంగతి తెలియటం వల్ల వదిన కపకారం జరుగు తుందని నీకనిపిస్తే నాకు చెప్పొద్దులే అక్కయ్యా!"

రుక్మిణి ముఖం మ్లానమయింది. "నువ్వెంత విస్తారంగా మాట్లాడుతున్నా నీ మనస్సు బాధ పెట్టే సంగతి చెప్పలేక పోతున్నాను బాబూ!"

"ఇంతకన్న వేరే బాధ ఏముంది?" అన్నాడతను కుర్చీలో కూలబడి రెండు చేతుల మధ్యా తల దూర్చుకుని.

కొన్ని క్షణాల పాటు అతని వైపు దీర్ఘంగా చూస్తుండి పోయింది రుక్మిణి. "సరే, ఇంతవరకు వచ్చాక....ఇక నీనుంచి దాచి కూడా ప్రయోజనం లేదు...."అంటూ అల్మారా దగ్గరికి వెళ్ళింది. తాళం చెవులు తీసుకుంది. పెట్టె తెరిచి ఒక చిన్న గుడ్డ మూట తెచ్చింది. "చూడు."

ఆ మూటలోని నగలు చూసాడు శ్రీనివాస్. "ఏమిటివి?"

"ఈ నగలు గుర్తు పట్టగలవా?"

"వదిన....వదిన నగల్లా ఉన్నాయి." అన్నాడతను ఆశ్చర్య పోతూ.

"వదిన నగల్లా ఉండటం కాదు, మీ వదిన నగలే! ఒక్కొక్క నగే తాకట్టు పెట్టి డబ్బు తెప్పించింది అన్నపూర్ణ."

"నీ దగ్గర తాకట్టు పెట్టిందా?" అతని పెదవులు పొడారి పోయాయి.

"ఒక విధంగా అంతే అనుకోవాలి. మార్వాడీ కొట్లో పెడితే చివరికీ నగలు దక్కకుండా పోతాయని అమెక్కావల్సి నప్పుడల్లా ఆ డబ్బు నేనే ఇస్తున్నాను. నేను తెమ్మన్నప్పుడల్లా మీ బావ నోటు రాసో, బ్యాంకులో అప్పు తీసుకొనో తెస్తున్నారు....అయినా, మాకు మాత్రం అప్పెంతకాలం దొరుకుతుంది? అప్పు దొరికినా ఆలశ్యమ యిన కొద్దీ అసల్ని వడ్డీలు మింగేస్తాయి. అన్నపూర్ణ నగలు కాపాడ టం ఒక బాధ్యత, ఆమె గౌరవం కాపాడటం మరో బాధ్యత. రెంటి మధ్యా నలిగిపోతున్నాము మేము."

"ఇన్ని నగలు తాకట్టుపెట్టాల్సినంత డబ్బవసరాలేమున్నాయి?"

"పరిస్థితు లెల్లకాలం ఒక్కలా ఉండవుగా బాబూ!....భార్గవి పెళ్ళికి ఇంటి మీద తెచ్చిన అప్పు ఇంకా తీరలేదు. పొలం మీద అప్పు తెస్తేనే కాని...."

"....నాకు తెల్సు? అ డబ్బుతోనే పట్నంలో మా చదువులు సాగుతున్నాయని."

"అన్నీ సవ్యంగా ఉంటే, ఆ అప్పు తీర్చటం కష్టమేమీకాదు. సుశీల పెళ్ళి చేయటం, ఆ వెంటనే మీ నాన్నగారు రిటయిరవ్వటం, మరో మూల ఆకాశాన్నంటే ధరలు....ఆదాయం తరిగి పోవటం- ఖర్చులు పెరిగిపోవటం-పాపం! సూర్యం చాలా అవస్థలు పడ్డాడు. అందుకనే షాహుకారు కొట్లో పార్ట్ టైమ్ పనికి చేరాడు. మరి కొన్నాళ్ళు ఓర్చుకొని ఉంటే అతని శ్రమ ఫలించేది. నేడో రేపో నువ్వు చేతి కంది వచ్చేవాడివి. ఇక నుంచి బాధలు తప్పేవి."

"ఏమయింది?" శ్రీనివాస్ ఆతృతగా అడిగాడు.

"నీకు తెల్సుగా—మీ బావగారూ, సూర్యం ఎంత ప్రాణ స్నేహంగా ఉంటారో. తన కష్ట సుఖాలన్నీ మా దగ్గర చెప్పు కుంటాడు కదా. మా సలహా తీసుకోందే ఒక్కడుగయినా ముందుకు వేసేవాడు కాదు కదా."

"అవును. ఏం చేసాడు?"

"ఓ సారి మీ బావకి జ్వరం వచ్చింది. ఆయన వారంరోజులూ

ఆఫీసుకి వెళ్ళలేదు. ఒంటరి వాణ్ని చూసి గణపతి వల వేశాడు. తన విషవలయంలోకి లాక్కున్నాడు."

"గణపతి అంటే అన్నయ్యతో వాళ్ళ బ్యాంకులో పనిచేస్తాడు. అతనేనా?"

"అవును, అతనే. ఎన్నో రోజులుగా సూర్యం ఒంటరిగా ఎప్పుడు దొరుకుతాడా అని కాచుకొని ఉన్నాడు కాబోలు! మీ బావ గారు వెంటలేనప్పుడు ఈ అమాయకుడు దొరికిపోయాడు. ఆ వారం లోనే సూర్యం బుర్ర పూర్తిగా సాదు చేసేసాడు గణపతి."

"ఏమయింది?"

"ఇంకా నీకర్థం కాలేదా? మీ అన్నయ్యా డబ్బు పెట్టి పేకాట ఆడుతున్నాడయ్యా బాబూ!" అంది రుక్మిణి చేత్తో తల మొత్తుకుంటూ.

శ్రీనివాస్‌కి షాక్ తగిలినట్టయింది.

"యింటి అరుగుల మీద పేకాట జరుగుతోంది. అది పెద్ద వాళ్ళు....కాలక్షేపం కోసం చేస్తున్న పని. కాని, రాత్రి ప్రొద్దు పోయే దాకా వెంకటాపురంలో రహస్యంగా పేకాడి ఒక్కడూ వస్తు న్నాడు సూర్యం. అంతా అతనేదో కష్టపడి పని చేసుకుంటున్నాడను కుంటున్నారు. కాని, పగలు పడిన కష్టాన్ని రాత్రివేళ బుగ్గిలో పోస్తున్నాడని ఎవర్కీ తెలియదు."

నోట మాట రాక శిలాప్రతిమలా ఉండిపోయాడు శ్రీనివాస్.

"ఇప్పుడు చెప్పు?....తన కష్టార్జితాన్ని తానే మూర్ఖంగా మంట పెట్టుకుంటున్న మీ అన్నయ్య శంకరావి కేమని సలహా ఇవ్వగలడు? తన భర్త వ్యసన పరుడయినప్పుడు....నీ భర్త తప్పు చేస్తున్నాడే మని సుశీలని అన్నపూర్ణ అడగగలదా? ఈ పరిస్థితిలో మీ వదిన ఏం చేయాలో నువ్వే చెప్పు శీనూ?".

శ్రీనివాస్ ముఖం తెల్లగా పాలిపోయింది.

రుక్మిణి నగలన్నీ మళ్ళీ గుడ్డలో మూట కట్టించి. తీసుకువెళ్ళి పెట్టెలో పెట్టి తాళం వేసి వచ్చింది. శ్రీనివాస్ ప్రక్కనే కుర్చీలో కూర్చుంది. "బాధ పడకు బాబూ!" అంది నెమ్మదిగా.

"అన్నయ్య ఇలా అయిపోయాడంటే నమ్మ లేకుండా ఉన్నాను." అన్నాడతను గద్గద కంఠంతో.

"మొదట్లో అన్నపూర్ణా, నేను కూడ నమ్మలేదు....కాని, నెల నెలా జీతం తక్కువ తెచ్చి యిస్తుంటే ఇంక నమ్మకుండా ఎలా ఉంటాము?"

"బావ చెప్పినా...."

రుక్మిణి కళ్ళొత్తుకొని పేలవంగా నవ్వింది. "మీ నాన్నగారికి లాట్రీలు, మీ బావకి రేసులు. పేకాట కూడా అదృష్టం పరీక్షించు కోటానికో మార్గమంటాడు మీ అన్నయ్య. ఎప్పుడో ఒక్కసారిగా కల్పొస్తుందట. ఒక్కొక్కరికి ఒక్కో రకం పిచ్చి! నువ్వన్నట్టు మీ నాన్నగారి లాట్రీల విషయం పెద్ద సమస్య కాదు. శంకరం సంపాదించటం లేదు కనుక అతనికి డబ్బు విలువ తెలియదని సరి పెట్టుకుందాం. మరి, తను కష్టపడి సంపాదిస్తుండి కూడా సూర్యం ఇలాంటి వ్యసనానికి లోనయ్యాడంటే ఏమనుకోవాలి? కేవలం మన దురదృష్టం. అంతే!"

శ్రీనివాస్ నేల చూపులు చూస్తూ ఉండిపోయాడు.

"ముందు నాల్గు రోజులు డబ్బు వచ్చింది. మళ్ళీ అలాగే ఓ రోజున వస్తుందంటాడు సూర్యం. అదంతా వీలాంటి వాళ్ళకి డబ్బు మీద ఆశ కల్గించటానికి గణపతి లాంటి వాళ్ళు చేసే పన్నాగం.... పోయిందేదో పోయింది. ఇక నుంచయినా ఆ తప్పు దారి వదిలి పెట్టు-అని మీ బావ ఎంతో చెప్పారు. గణపతి స్నేహం పట్టాకనే అప్పలరాజు లంచాలు పుచ్చుకొని పట్టుబడి జైలు పాలయ్యాడు. బ్రహ్మానందం పుట్టింటి నుంచి డబ్బు తెమ్మని పెళ్ళాన్ని చావగొడు తుంటే ఆవిడా దెబ్బల బాధ పడలేక ఆ పుట్టింట్లోనే ఉండిపోయింది. ఇలా ఎంతో మంది ఎన్నో విధాల పేకాట వ్యసనంలో పడ్డాక నాశన మైపోయారు. వాళ్ళ కుటుంబాలు వీధిన పడిపోయాయి. పెళ్ళాం బిడ్డలు ఆకలి బాధతో మలమల మాడి పోతున్నారు. అవన్నీ సూర్యానికి గుర్తు చేసారు మీ బావ. ఉన్న దానితో తృప్తిపడని భార్య ఉందంటే-నువ్విలా పేరాశ పడటానికయినా అర్థముంది. అన్నపూర్ణ అలాంటి ఇల్లాలు కాదురా-ఆమె కంట నీరు చిందితే మీ యింటికి జయం కాదురా-అని చిలక్కి చెప్పినట్టు చెప్పారు. బ్రతి మాలారు, బామాలారు. అఖరికి ఎందుకూ కొరగాకుండా పోతావు

రా-అని భయపెట్టేరు. తన స్నేహాన్ని త్రెంచేసుకుంటానని బెదిరించారు.ప్చ్!ఆయన ప్రయత్నాలన్నీ వృధా అయిపోయాయి బాబూ! ఆయన ప్రార్థనలు, బోధనలు, బెదిరింపులు, ఏవీ అతని తల కెక్కలేదు....ఎప్పుడో వందలకి వందలు డబ్బు సంపాదించి అప్పులన్నీ తీర్చివెయ్యవచ్చను కుంటున్నాడే కాని....ఇప్పుడు కట్టుకున్న భార్యని విప్పుల్లో నిలబెడు తున్నానని అతనెక్కడా గుర్తించే స్థితిలో లేడు. పోయిన డబ్బు రాబట్టుకోవాలన్న తపనే కాని, ఇంకా ఇంకా డబ్బు పోతోందన్న స్పృహ, జ్ఞానం లేకుండా పోయింది. పూర్తిగా మూర్ఖుడై పోయాడు బాబూ!"

శ్రీనివాస్ ముఖంలో కళాకాంతే లేవు.

"మీ అన్నయ్య మా యింటి గుమ్మం తొక్కి....నాతో మాట్లాడి ఆరునెల్లయింది శీనూ!'' అంది రుక్మిణి కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ.

"అక్కయ్యా...."

"అందుక్కూడా నేను బాధపడను బాబూ! మనమంతా అన్నపూర్ణ తర్వాతి వాళ్ళమే. ఇంటికి రావాలి కనుక రావటం, తినాలి కనుక నాల్గు మెతుకులు తినటం, ఆఫీసుపని, కొట్లోపని, ఆ పేకాట.... ఆ స్నేహాలు, ఇదే అతనికి జీవితమైపోయింది కాని, కట్టుకున్న భార్యతో మనసిచ్చి ఒక్క ముక్క మాట్లాడాలని - ఈ సంసారం ఈదటాని కామె ఎన్నో అవస్థలు పడుతోందని అతను గుర్తించటం లేదు. పిల్లల్ని దగ్గరకి తీయటంలేదు. స్నేహితులతో మంచీ మాటా లేదు. నవనీతంలాంటి అతని మనస్సు ఇప్పుడిలా పాషాణం అయిపోయింది. ఎప్పటికి మనలో పడతాడో అర్థం కావటంలేదు....అదే నా బాధ."

"....నా కివేవీ తెలియ వక్కయ్యా!". అన్నాడు శ్రీనివాస్ గద్గద కంఠంతో. అతని కళ్ళల్లోనూ నీళ్ళు చిందాయి.

"పిచ్చివాడా! ఇవి తెల్సుకోక పోవటం నీతప్పా?....అసలు నీకిదంతా చెప్పానని తెలిస్తే అన్నపూర్ణ ఎంతో నొచ్చుకుంటుంది. చెప్పేదాకా నన్నూపిరి తీసుకోనిచ్చావు కాదు. అనవసరంగా నిన్ను బాధపెట్టిందాన్నయ్యాను, ఆమెకిచ్చినమాట తప్పినందాన్నీ అయ్యాను."

"ఇప్పుడేం చేయాలి?...." తనలో తను గొణుక్కుంటున్నట్లు అన్నాడతను.

"ఏం చేయగలం? మనమేం చేయగలం? అతనేమన్నా చిన్న పిల్లాడా బెదిరించి చెప్పటానికి? స్నేహంతో, చనువుతో మీ బావగారు చేసిన ప్రయత్నాలు వృథా అయిపోయాయి. అన్నపూర్ణ ప్రార్థనలు, కన్నీళ్ళు నిష్ప్రయోజనాలయ్యాయి.....ఇంట్లో ఎవరు తప్పుచేసినా సరిదిద్దొచ్చు, నచ్చచెప్పొచ్చు. ఇంటిపెద్దే తప్పుదారిని నడిస్తే ఎవరేం చెప్పగలరు? ఇంటిపరువు ఎక్కడ బజారున పడిపోతుందో అని ప్రాణాలు అరచేతబెట్టుకొని బ్రతుకుతోంది ఆ పిచ్చితల్లి. ఎప్పుడూ చిరునవ్వులు చిందే ఆమె ముఖమే చూస్తున్నారు కాని....ఆమె గుండెల్లో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయని ఎవ్వరికీ తెలియదు. అందుకనే, నేనన్నది....ఆమె సమస్యని కాలమొక్కటే పరిష్కరించాలని.''

అతను చేతులతో ముఖం కప్పుకున్నాడు.

రుక్మిణి లేచి వచ్చింది. అతని తలమీద చేయివేసింది. "బాధ పడకు శీను బాబూ!....నువ్వే అన్నావు—అన్నపూర్ణ నీ తల్లిలాంటి దని. ఏదో ఒకరోజున ఆ తల్లి కష్టాలు నీవల్లనే గట్టెక్కుతాయేమో?"

శ్రీనివాస్ తలయెత్తాడు. కన్నీళ్ళతో అతనిముఖం కళావిహీనమై ఉంది.

"నిన్నీస్థితిలో ఎవరయినా చూస్తే బావుండదు. లేచి ముఖం కడుక్కో."

అతనింకా అలాగే కూర్చుండి పోయాడు.

"తలుపు వేసొస్తాను...." అని వాకిట్లోకి వచ్చి, తలుపు ప్రక్కన గోడకు బల్లిలా అంటుకుపోయిన భవానిని చూసి నిర్ఘాంత పోయింది రుక్మిణి. "భవానీ!"

"అక్కయ్యా!...."అంటూ రుక్మిణిని కావలించుకొని బావురు మంది భవాని.

"ఏమిటిది? ఎందుకేడుస్తున్నావు?...." అని కంగారుగా అడిగింది రుక్మిణి.

శ్రీనివాస్ గబగబా లేచి వచ్చాడు. "భవానీ! .... ఎందుకే! ఏమయింది?" అని ఆత్రుతగా అడిగాడు.

వెక్కునాపుకుంటూ, "అక్కయ్య నీతో చెప్పిందంతా విన్నా నన్నయ్యా!...." అంది భవాని.

ఇద్దరూ తెల్లబోయారు.

"ఛ! ఎంత పొరపాటయిపోయింది?....నే నింక అన్నపూర్ణ ముఖం ఎలా చూడను?" అంది రుక్మిణి నొచ్చుకుంటూ.

"అసలు నువ్వెందుకు వచ్చావిక్కడికి?" అని అడిగాడు శ్రీనివాస్ విసుగ్గా.

"పార్వతి వాళ్ళింటికి వెళ్లాను. తిరిగివస్తూ అక్కయ్యని చూడాలనిపించి ఇటువచ్చాను. మీ మాటలు వినిపించాయి....లోపలికి రావటానికి నాకు కాళ్ళాడలేదు." అంది భవాని కళ్ళు తుడుచుకుంటూ.

"ఛ! తలుపులు తీసి ఉన్నాయన్న స్పృహలేకపోయింది నాకు. ఇంకెవరేనా వినివుంటే ఎంత అప్రతిష్ఠ!....అన్నపూర్ణ నన్నెంత అసహ్యించుకొనేది.....ఈ వేళేమిటో నాకు పూర్తిగా మతిపోయింది. నీతో ఈవిషయం చెప్పటమే ఒకపెద్ద పొరపాటయింది శీనూ!" అంది రుక్మిణి.

"నీకు మాట తెప్పించనులే అక్కయ్యా! ఈ బాధంతా ఇక్కడే దిగమ్రింగి వెళ్ళిపోతానులే!'' అంది భవాని ముఖం తుడుచుకుంటూ.

"ఒక విధంగా నువ్వీ సంగతిచెప్పి నాకళ్లు ఇప్పుడే తెరిపించావు అక్కయ్యా!'' అన్నాడు శ్రీనివాస్ ఏదో ఆలోచిస్తూ.

రుక్మిణి అయోమయంగా చూపింది.

"చెల్లాయి, నేనూ చేతనయితే వదినబాధ తగ్గించటానికి ప్రయత్నిస్తాము. అంతేకాని, ఆవిడ మనస్సు చిన్నబుచ్చుకొనే పనేదీ చేయం. ఈ సంగతి మా పెదవుల్ని దాటనివ్వం. నా మాటనమ్ము!" అని శ్రీనివాస్ భవానివైపు చూసాడు.

రుక్మిణి చేతులు పట్టుకుంది భవాని. "అవునక్కయ్యా! అది మా బాధ్యత కూడా."

రుక్మిణి ముఖం తేటపడింది.

# 17

ఆ మర్నాడు ప్రొద్దున్న సూర్యం బయటకు వెళ్ళబోతున్నవేళ.

"ఈవేళ మేము వెళ్ళిపోదామనుకుంటున్నాము అన్నయ్యా!" అన్నాడు శ్రీనివాస్.

సూర్యం అన్నపూర్ణవైపు చూసి, "నువ్వు నాకు చెప్పలేదేం?" అని అడిగాడు.

ఆమె నోరు విప్పటానికి ముందే శ్రీనివాస్ అన్నాడు. "నేనింకా ఎవరికీ చెప్పలేదు. ముందు నీతోనే" అన్నాడు.

సూర్యం కంగారుగా అన్నాడు. "అదేమిటి? అప్పుడే వెళ్ళిపోవటం? ఇంకా భవానికి శలవులున్నాయిగా?...."

"నాకు చదుకోవాల్సిన పాఠాలున్నాయి అన్నయ్యా!" అంది భవాని తలదించుకుని.

"నాకూ ఇక్కడ తోచడంలేదు....." అన్నాడు శ్రీనివాస్.

వాళ్ళిద్దర్నీ మార్చిమార్చి చురచురా చూసింది సునంద. కాని, నోరు విప్పి ఏమీ చెప్పలేకపోయింది.

ఓ క్షణం ఆగి, "సరే మీ యిష్టం," అన్నాడు సూర్యం.

సైకిలు తీసుకొని వీధిలోకివెళ్ళి స్టాండు వేసి ఓ క్షణం ఏమాలోచించుకున్నాడో తిరిగి లోపలికి వచ్చాడు. తిన్నగా తన గదిలోకివెళ్ళి "పూర్ణా!" అని పిలిచాడు.

అన్నపూర్ణ వచ్చింది.

"మరి.... నా దగ్గరేం డబ్బులేదు." అన్నాడు.

ఆమె విశ్చలంగా ఓ క్షణంపాటు అతనివైపు చూసింది.

"నా దగ్గరాలేదు. ఇలా అవసరం వస్తుందనే అప్పుచేసి తెప్పించాను."

సూర్యం ముఖం తేటపడింది. "పోన్లే, ముందు పని జరిగింది...." అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

"రెండు మూడు రోజుల్లో ఏదయినా డబ్బొస్తే నీకిస్తాను."

"ఎవరయినా బాకీ యివ్వాలా?"

అంతలో అతని ముఖం ముడుచుకుంది. "కాదు...." అన్నాడు ముక్తసరిగా.

మరియేమిటి?- అని ఆమె అడగలేదు. గాఢంగా నిట్టూర్చింది.

"వెడతాను...." అని ఓ అడుగువేసి మళ్ళీ వెనక్కి వచ్చాడు.

"మరి.... వాళ్ళకి బట్టలు పెట్టొద్దూ?" అన్నాడు.

భర్తకా మాత్రం స్పృహ కల్గినందుకే ఎంతో పరమానంద పడింది అన్నపూర్ణ.

"అవి కూడా తెప్పించాము."

భార్యవైపు ప్రేమగా చూశాడతను. "పాపం! అన్నీ నువ్వే చూసుకుంటున్నావు."

ఆ మాటకే ఆమె ఎంతో తృప్తిపడింది. ఆనందాశ్రువులు కళ్ళల్లో నిలిచాయి.

"నన్ను క్షమించు." అన్నాడు సిగ్గుపడుతూ.

చటుక్కున అతని నోరు మూసిందామె. "అంత మాటన కండి...."

"మన బాధలెప్పుడూ ఇలాగే- ఉండిపోవు. మంచిరోజులు వస్తాయి.

ఈ పూట ఇంతసేపు నిలబడి అతనన్ని మాటలు మాట్లాడటమే ఆమెకు చిత్రంగా ఉంది. "అవును. మంచిరోజులు తప్పకుండా వస్తాయనే ఎదురు చూస్తున్నాను." అంది. ఆ మంచిరోజులు వచ్చినంత పరమానందమే కల్గింది ఆమెకు.

భార్యవైపు వాత్సల్యంగా చూశాడతను.

"పాపం! మీతో కబుర్లు చెప్పాలని ఎంతో ఇదవుతున్నాడు మీ తమ్ముడు. పోనీ, ఈ పూటకి శలవు పెట్టలేరా?" అని అడిగింది అన్నపూర్ణ ఎంతో ప్రాధేయ పూర్వకంగా.

ఆమె కళ్ళల్లోని ఆశ, ప్రార్థన అతని మనస్సుని కదిలించాయి.

"మీకు వీలయితేనే!...." అంది మళ్ళీ.

"సరే. అలాగే శలవు పెడతాను."

అన్నపూర్ణ పారవశ్యానికి పట్టపగ్గాలు లేకపోయాయి. చటుక్కున అతని చేతులు పట్టుకొని కళ్ళకద్దుకుంది. ముద్దుపెట్టుకుంది.

సూర్యం చిత్రంగా చూశాడు.

"ఉండండి.... శీనుకో చెప్తాను" అని గది బయటకి పరిగెత్తింది. "శీనూ - శీనూ!" అని కేకపెడుతూ అతని గదిలోకి వెళ్ళింది.

శ్రీనివాస్ బట్టలు సర్దుకుంటున్నాడు. భవాని చీరలు మడత పెడుతోంది. సునంద ముఖం ముడుచుకొని మంచం మీద ఓరగా తల దించుకొని కూర్చుంది. అన్నపూర్ణ పిలుపుకి అంతా తలలు త్రిప్పి చూసారు.

"మీరీవేళ వెళ్ళొద్దు. మీ అన్నయ్య శలవుపెడతానన్నారు."

అందరి ముఖాలు పుచ్చపువ్వుల్లా విచ్చుకున్నాయి.

"నిజమా వదినా!" అంది భవాని ఇంకా ఆశ్చర్య పోతూనే.

"అవునమ్మా! నిజం. కావాలంటే నువ్వెళ్ళి అడుగు..."

విన్న విషయం కన్నా అన్నపూర్ణ ముఖంలోని ఆనంద పారవశ్యం శ్రీనివాస్‌ని ఎక్కువ సంతృప్తి పరిచింది. అతని తల మీద నుంచి పెద్ద బరువు దిగిపోయి నట్టయింది.

ఇక సునంద సంతోషానికి పరిమితమే లేక పోయింది. అక్కగార్ని ప్రేమగా కౌగలించుకుంది.

అంతా సూర్యం గదిలోకి వెళ్ళారు.

"మీ తమ్ముడు మీ నోటి వెంటే వినాలను కుంటున్నాడు."

సూర్యం చిన్నగా నవ్వాడు. "మరేదయినా ప్రోగ్రాము వెయ్యండి."

"ఏం చేద్దాం?..." అని అందరి ముఖాలు కలయ జూపింది భవాని- "చిన్న వదినా! నువ్వు చెప్పు?..."

"ఇక్కడ మనకు వెంటనే దొరికేవి ఏముంటాయి?... పోనీ, మనమూ పేకాట వేద్దాం." అంది.

సూర్యం ముఖం నల్లబడిపోయింది. అన్నపూర్ణ ముఖం ఎర్రనయింది. శ్రీనివాస్ అవస్త ఇక చెప్పక్కర్లేదు... అందరికన్నా

ముందు తేరుకుంది భవాని. "ఛ. అదొద్దు—నాకు రాదు, ఇష్టమూ లేదు."

అంతా అలా యెందుకయి పోయారో అర్థం కాక తెల్లబోతూ చూసింది సునంద. "ఏం చేద్దాం?"

"కర్ణం గారింట్లో కేరంబోర్డుంది. అప్పన్నని తెచ్చిపెట్ట మంటా." అంది భవాని చటుక్కున.

"అలాగే. ముందు మీరు కూడా భోజనాలు కానివ్వండి." అని కదిలింది అన్నపూర్ణ.

భోజనాలయ్యే సరికి అప్పారావు కేరంబోర్డు తెచ్చిపెట్టాడు.

"నువ్వు కూర్చో భవానీ!" అంది అన్నపూర్ణ.

"ఉహూఁ. మీరు నల్గురూ ఆడండి... నేను అంపైర్‌గా ఉంటాను" అంది భవాని.

"మరి యెవరెవరు జట్టు?" అన్నాడు సూర్యం.

"ఎవరి జంటతో వాళ్ళు." అని నవ్వింది అన్నపూర్ణ.

"అలాగయితే నువ్వూ పెద్దన్నయ్యా ఓడిపోతారు వదినా! చిన్నవదినకి స్ట్రైకర్ వస్తే మరింక ఎవ్వర్కీ దొరక నివ్వదు." అంది భవాని.

"అయితే,వదినా నేను జట్టు.—ఏమంటావ్ పిల్లా?" అన్నాడు శ్రీనివాస్.

సునంద సిగ్గుగా నవ్వి తలూపింది.

ఆటసాగింది. చిన్న పిల్లల్లా కేరింతలాడుతూ వాళ్ళలా ఆడు కుంటుంటే మహలక్ష్మికి ముచ్చటయింది."ఎన్నాళ్ళకి ఈ యిల్లు కళ కళలాడుతూ ఉంది." అనుకుంది.

గతమంతా ఒక పీడకల. ఇకనుంచి సూర్యం మారిపోయి నట్టేనేమో అని ఆశపడింది అన్నపూర్ణ.

క్రితం రోజున రుక్మిణి చెప్పినదంతా కల్పన కాదుగదా- అని సందేహించే వరకు వెళ్ళారు భవానీ శ్రీనివాస్‌లు.

కాని, అంతా తమ భ్రమేనని ఆ రాత్రే వాళ్ళకి తెల్సి వచ్చింది.

కొంతసేపు కేరమ్స్ ఆడాక.... "ఇంకేదయినా ప్రోగ్రాము

వేద్దాము అక్కయ్యా!" అంది సునంద.

"సాయంత్రం శివాలయానికి వెడదాం." అంది భవాని.

"నేనూ అదే మాటనబోతున్నానే అమ్మాయీ!" అంది మహాలక్ష్మి.

అన్నపూర్ణ సూర్యంవైపు చూపింది. "అలాగే!" అన్నాడతను.

శ్రీనివాస్‌కి కూడా సంతోషమయింది. కాని, సాయంత్రం నాల్గగంటల వేళ "ఒకసారి షాహుకారు కొట్టుకి వెళ్ళాలిరా!" అన్నాడు సూర్యం.

శ్రీనివాస్‌కి ఏమనటానికీ పాలుపోలేదు.

"పోనీ, త్వరగా వెళ్ళి వచ్చెయ్యన్నయ్యా!" అంది భవాని.

"చీకటి పడకముందే వచ్చేస్తానులే." అని చెప్పి సూర్యం వెళ్ళిపోయాడు.

సంజ పడకముందే అంతా బట్టలు మార్చుకొని తయారై కూర్చున్నారు. తన పని కట్టిపెట్టి వీరబ్రహ్మం వెళ్ళిపోయాడు. అప్పారావు కుట్టుపని చాలించి ఊళ్ళో తిరగటానికి పోయాడు. ఆఖరికి కుడి అరుగుమీద పెద్దలు ఆ పూట పేకాటకు స్వస్తిచెప్పి సాయంత్రపు వాహ్యాళికి వెళ్ళారు.

అన్నపూర్ణ దీపాలు వెలిగించింది. సూర్యం తిరిగి వచ్చే సూచనలెక్కడా కనిపించలేదు.

"మనం గుడికి వెడదామమ్మా!" అన్నాడు జగదీష్.

"అబ్బాయివస్తే పంపిస్తాను.... పోనీ, మీరు వెళ్ళరండమ్మా అన్నపూర్ణా!" అంది మహాలక్ష్మి.

నలుగురూ పిల్లలతో గుడికి వెళ్ళారు. దైవ దర్శనం చేసుకున్నారు. కాసేపు గుడి అరుగుల మీద కూర్చున్నారు, తిరిగివచ్చారు. వాళ్ళమధ్య మాటా మంతీ అన్నది లేకపోయింది. ఎవరూ ఏమీ మాట్లాడకపోయే సరికి సునందకీ నోరు పెగలలేదు.

రాత్రి భోజనాల వేళయినా సూర్యం రాలేదు.

ఎప్పటిలాగే "మీరు భోజనాలకి లేవండి శీనూ!" అంది అన్నపూర్ణ.

మారు మాటాడకుండా లేచి నాలుగు మెతుకులు తిని వచ్చాడు శ్రీనివాస్. ఆ రాత్రి ఎంతో సేపటికకాని అతనికి నిద్రపట్టలేదు.

ఇంటికి ఎడమ వైపునుంచి సందుఉంది. ఆ సందుగుండా సూర్యం గది ప్రక్కనుంచి దొడ్లోకి వెళ్ళవచ్చు. రాత్రిళ్ళు ఆ దారి వెంటవెళ్ళి తన తలుపు తడతాడు సూర్యం....

ఆ రాత్రి సూర్యం తిరిగి వచ్చేసరికి ఎప్పటిలాగే బాగా ప్రొద్దు పోయింది. తలుపు తట్టబోయాడు. నిద్రకళ్ళతో రోజుమాదిరి అన్నపూర్ణ తలుపు తీయలేదు. దగ్గరగా వేసివున్న తలుపు అదే దారి యిచ్చింది.

సైకిలు తెచ్చి గదిలో పెట్టాడు. తలుపు వేసి వచ్చాడు. ఇంటి లోపలి తలుపు దగ్గరగా వేసిందో లేదో చూసి వచ్చాడు. మంచం మీద చూస్తూ పడుకున్న అన్నపూర్ణ పైకి లేచింది. అతని ముఖంలో ఎక్కడయినా పశ్చాత్తాపం లాంటిది కనిపిస్తుందేమో నన్నట్లు చూసింది. అదేమీలేదు సరికదా అతని ముఖంలో ఏదో సంతోషం, సంతృప్తి కనిపించాయి. ఆమె దగ్గరగా వచ్చాడు. "ఇలారా." అని మంచం దగ్గరకి తీసుకువెళ్ళాడు. "కూర్చో!" అని ఆమెని కూర్చోబెట్టాడు. జేబులోంచి నోట్లు తీసి ఆమె చేతుల్లో పెట్టి గర్వంగా చూశాడు.

నోట్లవైపు, అతనివైపు మార్చిమార్చి చూసిందామె.

"లెక్కపెట్టు."

ఆమె లెక్కపెట్టలేదు. నిర్లిప్తంగా చూసింది.

"నే లెక్కపెడతా నిలాయియ్యి...." అని లెక్కపెట్టి.... "ఎనభై ఎనిమిది. చూశావా .... ఈవేళ లాభం." అని గర్వంగా నవ్వాడు.

ఆమె తల దించుకుంది.

"ఏమిటి అలా ఉన్నావు?"

"ఏమీలేదు."

"ఇన్నాళ్ళూ కొన్ని కిటుకులు తెలియక పోయింది కాని.... ఇకనుంచి చూస్తూండు.... ఎంత సంపాదిస్తానో?"

"వద్దు. నాకలాంటి సంపాదనలేవీవద్దు. మీరు నాకు దూరం

కాకండి. నాకన్యాయం చెయ్యకండి.'' అందామె కన్నీళ్ళతో.

"పిచ్చిదానా! ఇన్నాళ్ళూపోయింది. ఇప్పుడు వస్తున్నప్పుడు సంతోషించాలి కాని...."

"లేదు. నన్నిది సంతోషపెట్టటంలేదు. భయపెడుతోంది."

"....అన్నట్టు మీరంతా గుడికి వెళ్ళారా?" అని ప్రస్తావన మార్చాడు సూర్యం.

అన్నపూర్ణ తల వూపింది. "మీకోసం ఎంతో ఎదురు చూశాము. పాపం! వాళ్ళు ముఖాలు చిన్నబుచ్చుకున్నారు."

సూర్యం మాట్లాడలేదు.

అన్నపూర్ణ నిరాశ చేసుకుంది. "లేవండి అన్నం పెడతాను" అని తల త్రిప్పుకొని కళ్ళు తుడుచుకుంది.

## 18

ఆ సర్నాడు మంగళవారం.

రాత్రి సరిగా నిద్రలేకపోయినా ప్రొద్దున్నే త్వరగా మెలుకువ వచ్చింది శ్రీనివాస్‌కి. స్నానం చేసి బట్టలు వేసుకున్నాడు. సునంద భవానీ కూడా తయారయ్యారు.

అన్నపూర్ణ క్రొత్త చీరలు తెచ్చి బొట్టుపెట్టి వాళ్ళకిచ్చింది. "కట్టుకోండమ్మా!" అంది.

"ఇప్పుడెందు కక్కయ్యా?'' అంది సునంద బిడియంగా.

"కట్టుకోమ్మా! అక్క పెట్టింది వద్దనకూడదు." అంది మహాలక్ష్మి.

ఇద్దరూ కట్టుకు వచ్చారు. చూడ ముచ్చటగా ఉన్నారు. మహాలక్ష్మి చెప్పింది- అందరికీ నమస్కారాలు చేశారు.

"బావకి....'' అని నసిగింది సునంద.

అన్నపూర్ణ వాళ్ళని సూర్యం గదిలోకి తీసుకువెళ్ళింది. అప్పుడే అతను ముఖం కడుక్కొని వచ్చాడు. "కాళ్ళు పట్టండి!'' అంది అన్నపూర్ణ.

అతని కాళ్ళకి ఇద్దరూ ప్రణామం చేశారు.

"వెళ్ళొస్తా బావా!" అంది సునంద.

"మళ్ళీ ఎప్పుడు వస్తావు?" అని నవ్వుతూ అడిగాడు సూర్యం.

సిగ్గుపడుతూ నవ్వింది సునంద.

"అక్కయ్యగారింటికి వెళ్ళొద్దాం పదండి." అన్నాడు శ్రీనివాస్- గుమ్మంలోకి వచ్చి.

అన్నదమ్ముల చూపులు కలుసుకున్నాయి. తమ్ముడి చూపులకి తట్టుకోలేక తల త్రిప్పుకున్నాడు సూర్యం.

ముగ్గురూ పరంధామయ్య గారింటికి వెళ్ళారు. ఆయన మెట్లు దిగుతూ ఎదురు వచ్చాడు. "శుభం!.... పట్నం ప్రయాణమేమిటర్రా?" అని అడిగాడు.

శ్రీనివాస్ తల వూపాడు. పరంధామయ్య చతుర్ముఖ పారాయణానికి జగన్నాధం గారింటికి వెళ్ళిపోయాడు.

"అప్పుడే ప్రయాణమా?" అని పలకరించాడు పద్మనాభం.

"శ్రీనివాస్ నవ్వులో జీవంలేదు.

"ఇంకెంత.... ఐదారునెల్లు. హాయిగా ఓచోట కూచుని ప్రాక్టీసు పెట్టుకోవచ్చు" అని మళ్ళీ పద్మనాభమే అన్నాడు.

"చెప్పి వెడదామని వచ్చామక్కయ్యా!" అంది భవాని.

"జాగ్రత్తగా చదువుకోమ్మా!" అంది రుక్మిణి అర్ధవంతంగా నవ్వుతూ.

"పట్నం వచ్చినప్పుడు నా ముఖం కూడా కాస్త చూపిపొండి బావగారూ!" అంది భవాని చిరునవ్వుతో.

"తప్పకుండానమ్మా. మొన్న వచ్చినప్పుడు బొత్తిగా ఖాళీలేక రాలేకపోయాను. ఈమాటొస్తాగా." అన్నాడు పద్మనాభం.

రుక్మిణి రెండు జాకెట్టు గుడ్డలుతెచ్చి ఇద్దర్కీ పెట్టింది.

"అయ్యో! ఏమిటండీ ఇది?" అంచె సునంద బిడియంగా.

"నేను మీయింటి పెద్దాడ పడుచుని.... వస్తే క్రొత్త చీర కట్టుకొని కాని మరీవెళ్ళను. తెలుసా?" అని నవ్వింది రుక్మిణి.

అక్కడ మరికాసేపు వుండి ముగ్గురూ తిరిగి వచ్చేసారు. వస్తూనే తిన్నగా తన గదిలోకి వెళ్ళిపోయాడు శ్రీనివాస్. అప్పటికి తయారయి వున్నాడు సూర్యం. తమ్ముడి గదిలోకి వచ్చి, "ఈపూట

వెళ్ళిపోతున్నారా?" అన్నాడు.

ఊ కొట్టాడు శ్రీనివాస్. "మరి నేను త్వరగా వెళ్ళాలి. వెళ్ళనా?" అన్నాడు సూర్యం. మళ్ళీ ఊ కొట్టాడు శ్రీనివాస్.

సూర్యం వెళ్ళిపోయాడు.

అన్నపూర్ణ వచ్చింది. "అన్నం తిందుగాని రా శీనూ!" అంది.

తల యెత్తకుండానే, "ఆకలిగాలేదు వదినా!" అన్నాడు.

"ఏదో అయినంతే తిను. పోనీ నా తృప్తి కోసం!"

ఇంకేమీ అనలేకపోయాడు. ఆమె వెంట వంటింట్లోకి వెళ్ళాడు. ముగ్గుర్కీ పెట్టింది అన్నపూర్ణ. ఏదో దిగులు అందర్నీ చుట్టబెట్టింది. బాధతో నిండిన కడుపులు తిండికి చోటిచ్చాయి కాదు. తిన్నామనిపించుకుని లేచిపోయారు.

శ్రీనివాస్ దగ్గరకు వచ్చింది అన్నపూర్ణ. డబ్బు అందిస్తూ, "తీసుకో శీనూ!" అంది.

అతని ముఖం కళతప్పింది. ఆమే తన ప్రాణాలు అరచేత పెట్టి యిస్తున్నట్టనిపించిందతనికి.

"స్టయిఫండు వస్తోందిగా? నా దగ్గర ఉంది వదినా!...."
అన్నాడు తడబడుతూ.

"పట్నంలో ఉన్నవాళ్ళు మీరు. ఏదో ఒక ఖర్చుంటుంది. ఉంచు బాబూ!" అంది అన్నపూర్ణ.

"ఇంతక్కర్లేదు. ఒక వందయియ్యి.... చాలు!"

"రేపు నువ్వు సంపాదించటం మొదలుపెడితే ఇవ్వటం నీవంతు- పుచ్చుకోవటం నావంతు...." అని నవ్వింది ఆమె డబ్బందిస్తూ.

తట పటాయిస్తూ అందుకోబోయాడు. చేయి వణికింది.

అన్నపూర్ణ కంగారుపడింది. "ఏమిటి బాబూ! అలా ఉన్నావేమటి?...." అంటూ అతని చేయిపట్టుకు చూసి, "ఒంట్లో బాగాలేదా?" అని ఆత్రుతగా అడిగింది.

వెనకనుంచి వచ్చిన భవాని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అంది. "మిమ్మల్నందర్నీ వదలి వెళ్ళిపోతున్నాం కదా! అందుకని అలా

ఉన్నాడన్నయ్య!" అంటూ అన్నగారికి కళ్ళతోనే పంజ్ఞ చేసిం.
శ్రీనివాస్ గుండె దిటవు చేసుకున్నాడు. చటుక్కున వదిన
గారి చేతిలోంచి డబ్బు తీసుకొని జేబులో పెట్టుకున్నాడు.
"గుర్రం బండొచ్చింది!" అంటూ పరిగెత్తుకు వచ్చాడు జగదీష్.

అంతా గది బయటకి వచ్చారు. బండివాడు సామాను తీసుకు వెళ్ళి బండిలో వేశాడు.

"ఉత్తరం వ్రాస్తూండండి బాబూ!" అంది మహాలక్ష్మి చెమర్చిన కళ్ళతో.

"అలాగేనమ్మా! అన్నయ్య వ్రాయకపోయినా నేను రాస్తాను." అంది భవాని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ.

అమ్మాయిలిద్దరూ ముందు బండెక్కారు. కొన్ని క్షణలపాటు వదినగారి వైపు దీర్ఘంగా చూశాడు శ్రీనివాస్. "నీ ఆరోగ్యం జాగ్రత్త వదినా!" అన్నాడు.

అన్నపూర్ణ చిత్రంగా చూపింది.

అతను చటుక్కున తల త్రిప్పుకొని, "వెళ్ళొస్తా నాన్నా!.... వెళ్ళొస్తా మామయ్యా!" అని అందర్కీ పేరుపేరునా చెప్పి బండెక్కాడు.

బండి వీధి మలుపు తిరిగే వరకూ అంతా అక్కడే నిలబడి పోయారు.

లోపలికి వచ్చాక "అదేమిటత్తయ్యా! శీను అలా వున్నాడు?" అంది అన్నపూర్ణ.

ఆమె ప్రశ్న అవిడకర్థం కాలేదు. "ఏమిటమ్మా! ఎలా వున్నాడు?" అంది మహాలక్ష్మి.

"ఏమిటో ముఖం చిన్నబోయి వుంది. ఆ పరాకుతన మేమిటో? ఆరోగ్యం జాగ్రత్తని మీతో చెప్పటంపోయి నాతో చెప్పాడు.."

మహాలక్ష్మి అన్నపూర్ణ వైపు పరీక్షగా చూసింది. "అవు నమ్మాయ్! నా చూపు పాడుగాను. నిత్యం చూస్తున్నా గుర్తించానే కాదు....నువ్వేమిటలా అయిపోయావ్? బొత్తిగా ప్రాణాలు కొల

కుర్లో ఉన్నాయి."

అన్నపూర్ణ నవ్వింది, "బాగానేవుంది! అతని మాట పట్టుకొని నాకనారోగ్యం అంటారేమిటి? నిక్షేపంలా ఉంటేను."

"ఏమయినా వాడు డాక్టరు! వాడి మాటలకి అర్థం లేదనకు."

"మీ డాక్టరబ్బాయిగారి పరాకుతనానికి కారణం వేరే ఉందత్తయ్యా!" అంది అన్నపూర్ణ.

"ఏమిటీ?"

"మీ తమ్ముడిగారికి కబురంపి త్వరగా ముహూర్తాలు పెట్టించండి!" అని నవ్వింది.

మహాలక్ష్మికి కూడా నవ్వు వచ్చింది. అన్నపూర్ణ అక్కడ్నించి వెళ్ళిపోయింది.

10

"ఎప్పుడూ పేపరు పట్టుక్కూర్చోవటమే కాని మీకేం పని లేదు." అంటూ విసుక్కుంది వరలక్ష్మి.

పేపర్లోంచి తలెత్తకుండానే, "....తిడితే నన్ను తిట్టుగాని, నా పేపర్ని తిట్టకు" అన్నాడు వెంకట్రావు నవ్వుతూ.

"కొంచెం ఇంటి విషయాలు కూడా పట్టించుకోవాలి."

"ఇప్పుడేం కావాలో చెప్పు" అన్నాడతను పేపరుమడిచి టీపాయ్‌మీద పెడుతూ.

"ఈమధ్య మీ అల్లుడు ఇంటికి రావటంకూడా మానేశాడు చూస్తున్నారా?"

"ఇంక రెండునెల్లు ఆగవే! ఆ పట్టా చేతికి వస్తుంది. ప్రాక్టీసు పెట్టుకుంటాడు. ఇక మన మాట వినకమానడు."

"నేననేది అతనిచేత ఊఁ అనిపించుకుంటే మనం ఈలోగా తాంబూలాలు పుచ్చుకొని రావచ్చు. పెళ్ళి ఏర్పాట్లకి మనకీ వాళ్ళకీ కొంత వ్యవధి ఉంటూ ఉండాలిగా?"

"సరే. నీ మాటెందుకు కాదనాలి? ఈ సాయంత్రమే వెళ్ళి అబ్బాయితో మాట్లాడి వస్తాను. సరేనా?"

# 20

"రా అన్నయ్యా! అన్నం పెట్టేస్తాను....": అంది భవాని.

పుస్తకంలోంచి తలెత్తి చూసాడు శ్రీనివాస్ "వస్తున్నా.... పద...."

భవాని కదలబోయి గుమ్మంలో అడుగుల చప్పుడై అటు తిరిగింది. అక్కడ చిరునవ్వు నవ్వుతూ నిలబడిన వ్యక్తినిచూసి "ఎవరు కావాలండీ?" అని అడిగింది.

"భవాని కావాలండీ''అంటూ నవ్వుతూ అతను గది లోపలికి అడుగుపెట్టాడు.

శ్రీనివాస్ అతన్ని చూసి గుర్తుపట్టాడు. "అరే ప్రసాద్! నువ్వా!" అన్నాడు కుర్చీలోంచి లేస్తూ.

భవాని ఆశ్చర్యంగా చూసింది "ప్రసాద్....నువ్వ....నువ్వ ప్రసాద్‌వా?" అంది తడబడుతూ.

ప్రసాద్ నవ్వాడు.

"రా యిలా కూర్చో!" అని కుర్చీ చూపించాడు శ్రీనివాస్.

ప్రసాద్ కూర్చున్నాడు.

"అవును!...అప్పుడు బక్కగా ఉండేవాడివి. రెండేళ్ళక్రితం నిన్ను చూసుండకపోతే నేనూ గుర్తుపట్టేవాడ్ని కాదు. ఏమయినా ఉత్తరానికి వెళ్ళాక తెల్లబడ్డావ్. లావెక్కావ్!" అని శ్రీనివాస్ నవ్వాడు.

ప్రసాద్ గలగల నవ్వాడు. భవాని బుగ్గలు ఎర్రనయాయి.

"ఇప్పుడెక్కడుంటున్నావ్?" అని అడిగాడు శ్రీనివాస్.

"హైద్రాబాదు ట్రాన్స్‌ఫర్ అయి నాల్గునెలలయింది. ఒకసారి మిమ్మల్నందర్నీ చూడాలనిపించి బయలుదేరి వచ్చాను. నిన్ననే గోపాలపురం వెళ్ళాను. మీరిక్కడే ఉన్నారని మాస్టారు చెప్పారు. మిమ్మల్ని కూడా చూసినట్టుంటుందని ఇలా వచ్చాను."

"సమయానికి వచ్చావ్....ప్రసాద్‌కి కూడా అన్నం పెట్టు చెల్లాయ్" అన్నాడు శ్రీనివాస్.

"అబ్బే, ఇప్పుడెందుకులే శీనూ!"

"మొహమాట పడుతున్నాడన్నయ్యా" అంది భవాని.

ఆమెవైపు కొన్ని క్షణాలపాటు దీర్ఘంగా చూసాడు ప్రసాద్. "కొన్ని సంవత్సరాలపాటు మీ యింట్లో తిన్నవాడిని. నాకు మొహమాటమేమిటి భవానీ?"

"లే ప్రసాద్! సరదాగా కబుర్లు చెప్పుకుంటూ తిందాం" అన్నాడు శ్రీనివాస్.

ప్రసాద్‌కి లేవక తప్పలేదు, ఇద్దరూ కంచాలముందు కూర్చున్నారు.

"మరి నీకో!" అన్నాడు ప్రసాద్.

"ముందు మీరిద్దరూ తినండి. నేను వడ్డిస్తాను" అని నేతి గిన్నె పట్టుకుంది భవాని.

ప్రసాద్ ఆమెవైపు ఆరాధనగా చూశాడు.

"ఏమిటలా చూస్తావ్?" అని నవ్వింది భవాని.

అతని కళ్ళముందు చిన్ననాటి భవాని ప్రత్యక్షమైంది. "మీ ఇంట్లో అన్నం తినే రోజుల్లో నువ్విలాగే వడ్డించేదానివి. యింకా వేయించుకోమని బలవంతంచేసి తినిపించేదానివి."

ప్రసాద్ ఆర్ద్రనయనాలు చూసి భవాని చలించింది. "అబ్బ! ఇప్పుడవన్నీ ఎందుకు? నీ అంతటివాడివి నువ్వయ్యావు" అంది బిడియంగా.

"లేదు భవానీ! అనాథలా బ్రతుకుతున్న నన్ను చేరదీసి జీవం పోసారు. ఇవేళ యిలా ఓ మనిషిలా బ్రతగ్గలుగుతున్నానంటే మీ యింట్లో ప్రతి ఒక్కరికీ నేను ఋణపడివున్నాను."

ప్రసాద్ వెన్నుమీద వాత్సల్యంగా తట్టాడు శ్రీనివాస్. "చ! అవేం మాటలు ప్రసాద్? మేమంతా ఉండగా నువ్వనాథవెలా అవుతావు?....నోనో. నువ్వా కాంప్లెక్స్ వదిలిపెట్టేయ్యాలి."

"అన్నం తినండి....చల్లారిపోతోంది" అని హెచ్చరించింది భవాని. ఇద్దరూ తినటం మొదలుపెట్టారు.

"ఇంకా ఏమిటి విశేషాలు?" అని అడిగాడు శ్రీనివాస్.

ప్రసాద్ ఒక్క క్షణం ఆగి అన్నాడు. "ఏమున్నాయి?

ఆఫీసు, ఇల్లు....ఎప్పుడయినా ఒక సినిమా....జీవితం ఏమి బోరుగా ఉంది."

"పెళ్ళి చేసుకో" అంది భవాని చటుక్కున.

ప్రసాద్ తలెత్తి చూశాడు. భవాని అలా అన్నందుకు సిగ్గు పడింది.

"చెల్లాయి అన్నమాట నిజమే. ఒంటరితనానికి మందు అదొక్కటే" అని నవ్వాడు శ్రీనివాస్.

ప్రసాద్ చిన్నగా నవ్వాడు. "నేనూ అదే పనిమీదవచ్చాను."

"అంటే?" అన్నా చెల్లెళ్ళిద్దరూ ఒక్కసారే అడిగారు.

"ఈ ఊళ్ళో ఏదో పెళ్ళిసంబంధం ఉందట. ఈవేళ పెళ్ళి చూపులకి రమ్మని ఉత్తరం వ్రాసారు."

"మరి అసలు విషయం చెప్పకుండా జీవితం బోరుఅంటూ డొంక తిరుగుడెందుకో?" అంది భవాని నవ్వుతూ.

"పెళ్ళికొడుకు కదా-సిగ్గుపడ్డాడు" అని నవ్వాడు శ్రీనివాస్.

"ఆ అమ్మాయిని చూసి నేను సర్టిఫై చేస్తానులే"అంది భవాని.

"నువ్వు తప్పకుండా వస్తావా భవానీ?" అన్నాడు ప్రసాద్ సంతోషంగా.

"నేనేమిటి?....అన్నయ్యకూడా వస్తాడు. మేమిద్దరం నీ తరఫున పెళ్ళిపెద్దలం అనుకో."

ప్రసాద్ శ్రీనివాస్‌వైపు చూశాడు.

"అవును ప్రసాద్!" అన్నాడు శ్రీనివాస్. (ఇంకా వుంది)

డిశంబర్ నెల "విజయ" నవలానుబంధం

విమలా రామం రచన

"అన్నపూర్ణ"

(రెండవ భాగం)

VIJAYA NOVEMBER 1977 Regd. No. M. TN



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M134 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCT |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | ch.Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |